# కదలి పోయిన రైలు బండి



నవోదయ పబ్లిషర్సు
ఏలూరురోడ్ - విజయవాడ-2.

# కదలిపోయిన రైలుబండి



"ఎల్లోరా"



నవోదయ పబ్లిషర్సు
ఏలూరురోడ్ - విజయవాడ-2.

# ఇందులో

* కదలిపోయిన రైలుబండి
* వెదుకబోయిన తీగె
* సరిహద్దు
* పరుగులూ! - ఉరుకులూ!!
* సమస్య తీర్చిన సంక్రాంతి

# కదలిపోయిన రైలుబండి

ఎదురుగుండా బల్లమీద చాలామంది కూర్చున్నారు। ఒక్కరూ నాకు తెలిసినవారు లేరు-అందులోనూ అటువంటి దూరప్రయాణాలంటే ఏమిటో ప్రాణం బిక్కుబిక్కుమంటూ వుంటుంది. ఆ సమయంలో మనవంక చూసినవాడు బంధువు। పలకరించినవాడు పరమాత్ముడు।

బండి స్టేషన్ వదిలిపెట్టి రెండుమూడు స్టేషన్లు కూడా వెనుకకు నెట్టుకు పోయింది. అసలు ఈ యినపమేక్ ధూమ శకటానికి మానవు లంటే అసలు గౌరవభావం ఉన్నట్లు కనుపించదు. ఆ మాత్రం గౌరవ భావం అనేది ఏకోశాన వున్నా నన్ను ఒంటరిగా అంతవేగంగా తీసుకు పోయేదేనా ?

ప్యాసింజరుకు బీదవారంటే కొంచెం అభిమానం। ఇక మెయిలు బండివుంది. చిన్నస్టేషన్లో ఆగదుసరికదా, నెమ్మదిగా నైనాపోదు. తనకేం చిన్నవారంటే లెక్కలేనట్లు।

ఇంతకీ అసైెమ్ అటువంటిది। ఆపొగరుబోతు దురుసుబండి మెయిల్లోనే ఎక్కి ప్రయాణించవలసిన అభాగ్యులలో నిర్భాగ్యుణ్ని నేనొకడిని. ఎక్కడంఎంతకష్టంమీద జరిగిందో-కూర్చోవడం అంతకురెండింతలుకష్టంమీద జరిగింది।

ఎక్కి ఎక్కేటప్పటికే ఓఆయనవచ్చి సారీబ్రదర్।ఇది'రిజర్వేషన్' కంపార్టుమెంటు అన్నాడు।

సరే। ఆమాట నమ్ముదామన్నా, 20వ శతాబ్దపుసూటు నాగరికత ఫేషన్లో దిగుదామన్నా-కంపార్టు మెంటుముందరే సుద్దముక్కతో"ఓన్లీ ఫర్ఎయిర్ ఫోర్సుమెన్" అనితాటికాయలంత అక్షరాలతో రాసివుంది।

అటుఆయన మాటనమ్మాడమా? ఇటుఈసుద్ద అక్షరాలను నమ్మ డమా?ఏం తోచక కొంచెంసేపు తికమక పడ్డాను అయినా ఒకవిషయం-అబద్దం ఆడినాఅతికినట్టుగా వుండాలి। అందులోనూ ప్రతివారికి ఇదోఅల వాటుఅయిపోయింది. "రిజర్వేషన్" అనడం, సుద్దతోఏదో ఒకస్పెషల్ కంపార్టుమెంటని ముందేరాసిపెట్టుకుని, అమాయకంగా కనుపిస్తే, మరీ దబాయించడానికి। ఇదినాకుచాలాబాధ కలిగింది.

బండి బయలుదేరింది మద్రాసునుంచి-తమిళ దేశంనుంచైనా ప్రయాణంచెయ్య వలసింది-యికముందు ఆంధ్రగ్రామసీమల మధ్యనుంచే। అటువంటిది ఆంధ్రుడ నయిననేను ఎందుకువెనకతియ్యాలి "అనుకుని

"లోనికి బెడ్ పెట్టి జరుగుబ్రదర్" అన్నాను। ఏమనుకున్నాడో ఏమోగట్టిగా 'హ్వాట్" అన్నాడు.

"హ్వాటులేదు గీటూలేదు। జరుగు" అన్నాను. ఇంకాపట్టుదలగా।

అదృష్టం అనేది అందరికీ అస్తమానంచెప్పిరాదు. కొంతమందికి కొన్నిసమయాల్లోనే అటువంటి అదృష్టం। ఇంతలోరైల్వే చెకింగ్ ఇన్ స్పెక్టరువచ్చి "ఎవరు ఈరాతరాసింది? నాన్సెన్స్" అంటూచెరిపి లోనికి వచ్చి "ఎక్కడికి మీరంతా అన్నాడు।"

"ఓన్లీఫర్ త్రీహన్డ్రడ్ మైల్సు ప్యాసింజర్సుకే" అన్నాడు కంచుమోగినట్లు చెకింగ్ యిన్ స్పెక్టర్।

చెబితే నమ్మండి। నమ్మకపోండి।। వెంటనే నా రాజమండ్రి టికె ట్ ని అదేపనిగా చేతిలో తీసుకుని 360 మైళ్ల అన్న అంకెను అదేపనిగా వందసార్లు చూచుకున్నాను.

ఆ వెనుక ఆముదం తాగినవాడిలా ముఖంపెట్టి నన్ను దబాయిం చిన సూటునాగరికుడు "హల్లో బ్రదర్" అంటూ మాటను మింగేశాడు।

ఆ అవస్థ నేను ముందే గ్రహించి "పర్వాలేదు. సర్దుకు కూర్చుం దాం। అందరం అడంగు చేరుకోవలసిన వాళ్ళమే" అన్నా।

జీడిపాకం ముక్క యిస్తే సంతోషపడే బాలుడిలాగ ముఖం యింత చేసుకుని, పరచిన బెడ్‌ని చుట్టి నన్ను పక్కనే కూర్చోపెట్టుకు న్నాడు రైలు మిత్రుడు.

విచిత్రం ఏమిటంటే అంతదాకా సీరియస్‌గా దెబ్బలాడిన మేమి ద్దరం బండి సగందూరం వెళ్ళేటప్పటికి ప్రాణస్నేహితుల మయిపోయాం। ఆ మహిమ రైలు పొగలో వుందో, ధ్వనిలో వుందో కాని। అందుకే మనవాళ్ళు అంటూంటారు దెబ్బలాటతో ప్రారంభమయిన స్నేహం ధృఢంగా కలకాలం నిలుస్తుందని। ఇందుకే కాబోలు।।

రైలు మిత్రుల కిచకిచతోటి, పకపకలతోటీ, ఒకరు కాఫీకి బిల్లు యిస్తే ఒకరు పేపరుకి బిల్లు చెల్లిస్తూ కులాసాగానే ప్రయాణం సాగిం చాం।

ఈ జరిగిన ప్రయాణంలో మాకు ఎదురుగుండా ఒంటరిగానే - ప్రయాణం చేస్తూన్న ఒక పదహారు ఏళ్ళ అమ్మాయి కూర్చునివుంది. చేతిలో ఒక తెలుగు వారపత్రిక పెట్టుకుని చదువుకుంటోంది. అప్పుడ ప్పుడు ఆపేపరు సహాయంతోనే అడ్డుగానే మమ్మల్ని, మాసంభాషణల్ని పరికిస్తూ, వింటూ తన వ్యావృత్తిలో తనువుంది.

ఆ అమ్మాయి ముఖములోను, దుస్తులధారణలోను చూపులలోను కొంచెం చదువుకున్న నాగరికత కనుపిస్తూందికనులకు - వినిపిస్తూంది చెవులకు।।

చాలా బొమ్మలు చూస్తూంటాము। చాలా కళ్లు పరికిస్తూనే వుంటాము.

కాని ఆ అమ్మాయి కళ్ళు, నడుం, ముక్కు, వేళ్ళ సొగసు చూస్తూంటే అజంతా సుందరి కుడ్య శిల్ప చాతురి 'ఓ' యని పలుకుతూ ఏమిటో తెలియని తన్మయత్వంలో ముంచెత్తుతూంది.

ఆ ప్రయాణంలో ఆకలికి తట్టుకున్నా, నిద్రాభంగానికి తట్టుకున్నా కాని, ఆ అమ్మాయి చూపుల బాణ సంధానానకి మాత్రం నేను తట్టుకోలేక ఆ అందాన్ని ఆహ్లాదంతో నీరాజనం నాహృదయం లోపలనే అర్పిస్తూ మొగలిరేకుల వుయ్యాలలో వూగిన లాగ సాగాను।

ప్రకృతి వింతభావం కలది। దీనిని చూస్తూంటే అంత అసూయ ఎందుకా అనిపిస్తూంది। మానవుణ్ని ఆడించగలదు। నవ్వించగలదు। ఏడుస్తూంటే పళ్ళికిలించి తనూ నవ్వగలదు। అందుకే ప్రకృతి చిలిపిది అంటారు। అన్నట్లే వుండి మా ఆనందపు కళ్ళజంటల సంభాషణలకు ఒకసారిగా బ్రేకువేసింది।

గుప్- గుప్‌అంటూ రైలువచ్చి పెద్దశ్వాసను వదలి బెజవాడ ప్లాటుఫారం మీద నిలబడింది। ఒక్కసారిగా ఆ అమ్మాయి అదిరిపడి ఏమిటో బిత్తరపోయినట్లు కిటికీలోనుంచి పరికించసాగింది.

నేను అంతదాకా చూపులనందిస్తూ ఆ సమయానికి అనుకోకుండా అప్రయత్నంగా ఒక్కసారి లేచి నుంచున్నాను. ఇంతలో "గుడ్‌బై బ్రదర్" అన్నాడు రైలుమిత్రుడు।

బిత్తరపడి ఒకేసారి 'బైబై' అన్నాను।

ఇంతలోనే గార్డు జెండావేయడం, ఈల వినపడడం జరిగింది. తిరిగి రైలు తననడక సాగించడం మొదలుపెట్టింది.

ఆ అమ్మాయి వుందా లేదా అని నేను; ఆతృతతో నాకేసి ఆ అమ్మాయి చూడసాగింది। నన్నుచూసీచూడడంతోనే వారపత్రిక అడ్డుగా పెట్టుకుని చదువులో మునిగిపోయింది।

ఈ విధమైన ప్రవృత్తిని ఏమనాలో నాకు తెలియదు. సిగ్గుఅన్నా, చిలిపితనం అన్నా సరిపోతుందేమో।

యుద్ధం ప్రకటించి మిత్రత్వసంధి చేసుకున్న రైలుమిత్రుడు బెజవాడలో దిగిపోయాడు। ఇతరత్రా రైలు సంభాషణలు ఏం కొనసాగ

లేదు. ముఖాలుమాత్రం చూసినవి కొన్ని, కొత్తవికొన్ని వున్నాయి। బాగా తెలుసును-అని అనుకోవలసిన అర్హత ఏదైనా వుంటే ఆ చిలిపి చూపుల ఎదుటి అమ్మాయి మాత్రమేనని అనుకొవలసి వుంటుంది। అందుకు నేనూ అటే ఊసుపోక చూస్తూ, ప్రయాణాన్ని కులాసాగా జరుపుకుంటున్నాను।

ఇందుకూ ఒక తెలివి వుండాలి। రైలుప్రయాణంలో అదే స్వర్గం లాగ కిచకిచలతో, పకపకలతో అడంగుకు కొంతమంది చేరుతే, కొంత మంది ఒంటెత్తుగా అటు యింటిలోనివారినీ, ఇంటినీ తలచుకుని, కాఫీ అయినా త్రాగకుండా బిక్కుబిక్కుమంటూ కూర్చుంటారు। అందుకే రైలు ప్రయాణంలోకూడా కొంత అనుభవం అవసరం॥

"ఈ అమ్మాయికి పెళ్ళి అయిందా? అయితే భర్త ప్రక్కన కనుపించదేమిటి? మెడలో పుస్తె కనుపించదే? పుస్తె అవసరంలేని వివాహం జరుపుకుని వుండలేదుగదా।

అలా తొంగి చూడకపోతే "ఏమండి కొంచెం కాఫీ తెద్దురూ" అనో కొంచెం ఈ సామాను చూస్తూంటారా.... గదిలోకి వెళ్ళివస్తాను" అనో పలకరించి స్నేహం చేసుకోక అలా పత్రికలో ముఖం దాచుకుని కంటిని మెలికలు తిప్పుతూ శ్రమపడకపోతే, ధైర్యంగా చూడకూడదూ?

అసలు ఈ స్త్రీబుద్ధే ఇంతేనేమో। అదేపనిగా మగవాడిని పరికించి చూడడం- తిరిగి ఆ మొగవాడు తనకేసి చూశాడా, ముఖం ముడుచుకుని ఏమీ ఎరగనట్లుగా మూగనోము పట్టడం, ఎవరిలోచూచినా ఇంతే।

హంస నడకలు నడిచేది ఒకతైతే, నెమలితిప్పులు తిప్పేది ఒకతె। వీరినని ఏంలాభం. ఆ కుమ్మరి బ్రహ్మయ్యనే అనాలికావి।"-

ఇలాగ ఏమిఏమిటో నాలోనేను తర్కించుకుంటూ- ఊహించుకుంటూ- అప్పుడప్పుడు ఎదుటి అమ్మాయిచూపులకు, చూపులుఅందిస్తూ కూర్చున్నాను।

"ఎవరు ఈతను? ఎవరితోనూ మాట్లాడకుండా మొద్దులా కూర్చు న్నాడు! అసలు ఇతను పురుషుడేనా! ఇంతసేపటినుంచి నేను చూస్తు న్నాను. చూసిచూసి నాకళ్ల మూతలుకూడా పడుతున్నాయి!

నిజమైన మొగాడు పనున్నా లేకపోయినా "ఏమమ్మాయి నువ్వు పడుకో....నీ సామాను నేను చూస్తాను అనో, కాఫీ పిలవమంటావా! అనో పలుకరించి ఎంత చనువుగా వుండేవాడో!

కాని ముఖం ఎంత అందమయింది? ఆ క్రాపు ఎంత అందంగా గూడు కట్టుకుని వుంది? మాట్లాడుతూవుంటే ఎంత హుషారుగా వుంది! అబ్బే! ఊరుకుంటే లాభంలేదు! మనమే మాట్లాడాలి! ఏంచేయడం? తన బెడ్‌మీద వున్న ఆనవలను చూద్దానికన్నట్లు అడిగితే అసలుసంగతి తేలు తుందిగా అక్కడకంటూ వెడితే సంభాషణ కంటిన్యూ చేయొచ్చు!

ఈ విధంగా ఆయనతో నా ప్రయాణంకూడా కొనసాగితే ఎంత ఆనందంగా వుంటుందో.... "అని తనలో తలుచుకుని కూర్చున్నచోటు నుంచి లేచి ఎదురు వెనుక వంగి "ఆ నవల కొన్నారా?" అంది.

గురితప్పిన బాణం గురిగా తగిలింది! ఉలికి పడ్డట్టు కదిలి "ఆ! సెంట్రల్‌లో తీసుకున్నా....తీసి చూడండి - పర్వాలేదు" అన్నా!

పుస్తకం చేత్తో తీస్తూ జెడలను బెడ్‌మీదుగా వాల్చి శరీరానికి తాకిస్తూ - ఓరగా ముఖాన్ని పరికిస్తూ తీసుకుంది!

అమ్మయ్య అనుకున్నా నేను! గట్టెక్కేమురా అనుకుంది ఆమె!!

ఈ ప్రయత్నంలో స్టేషను లెన్నో వెనక్కు జరిగిపోయాయి! ఇక ముందుస్టేషనులో దిగవలసి వుంది ఆమె. రైలుకంటే గుండె వేగంగా కొట్టుకుంటూంది! విద్యుత్‌కంటే హడావిడిగా మనోభావాలు పరుగులు పెడుతున్నాయి.

ఘప్ ఘప్ మంటూ రైలుబండి నడక సాగిస్తూంది. చూసినవి చూడటానికి - విన్నవి వినడానికే వీలులేకుండా రైలుబండి పరుగు-అం

దుకు మించి ఆమె మనస్సు పరుగు! చాలా హడావిడిలో మునిగివుంది మనోలోకం!

"ఏదోవిధంగా అమ్మాయిని పలుకరించి మంచి చెడ్డలు అడగాలి: ఏమి అందం! అజంతా సుందరి! ఆనందరాశి! మొగలిపొద! ఆ చూపులు చూస్తూ యుగాలు గడపవచ్చు. కాలాలు జైల్లో వుండవచ్చు! అబ్బ! ఏమితీరు! లేచి విషయం తెలుసుకుందాం."

"అదిగో మనం దిగవలసిన స్టేషన్ వచ్చేస్తూంది ఎలాగ? అడిగితే ఏం అనుకుంటాడో! పుస్తకం యిస్తూ ఒక్కసారి అన్నీ కదుపుతే బాగుండును! పుస్తకంమీద పేరైనాలేదు. ఈమాత్రం రాయాలని తెలియదూ?"

రైలుపొగలు జిమ్ముతూ వెడుతూంది ? లేచింది ఆమె! తిన్నగా సవరించుకుని, తన బెడ్ నిచుట్టి- దిగవలసిన వైపునకు వచ్చి నా ప్రక్కగా నుంచింది ఏమిటో అడగాలి. నోరు పెగలడం లేదు. పుస్తకం ఇంకా తనచేతిలోనే వుంది.

క్షణంలో సగం! స్టేషను వచ్చేసింది! అందరూ దిగిపోయారు! ఇంక బండి కదిలిపోయే వేళకూడా అవవచ్చింది!

"....... " భయం- కొత్త- సిగ్గు! ఏంచేయడం! గార్డు విజిల్ గూబల్లో గుయ్‌మంది! క్రిందికి దిగింది. పుస్తకం అందించింది!

జెండా ఎగిరింది....రైలు కదిలింది...."మీ....ఎ....డ్ర....స్" అనగలిగింది! కాని ఏంలాభం క్షణంలో సగం! ముందుగా అయితే సమాధానం అంటాడేమో. రైలు కదలిక ధ్వనితో, జనం రణగొణ ధ్వనిలో అందలేదు ప్రశ్న! రాలేదు సమాధానం!

అలాచూస్తూ నుంచునిపోయింది ఆమె! కదిలిపోయిన రైలుబండి. కంటికి దూరమైన రైలుబండి కరుణించని రైలుబండి! కదిలిపోయిన రైలుబండి కంటికి దూరమైపోయింది. ఉప్పుతిన్న పాలచెంబులాగ విరిగిన మనస్సుతో అలానుంచుని....అందని లోతులను....అంచనా వేయసాగింది ఆమె!!



# వెదుకబోయిన తీగె

అప్పుడే కాలేజీనుంచి భాస్కరం రూమ్‌కు చేరుకున్నాడు. తలుపు తెరిచేటప్పటికి అంతకుముందే తలుపు సందులోంచి పోస్టుమేన్ పడేసిన కవరు కనబడింది - "........చిరంజీవి భాస్కరానికి.

ఎన్ని జాబులు రాసినా సమాధానం యివ్వడంలేదు. నేను ముసలి వాడినయిపోయాను. ఈ ముసలిప్రాణం గుటుక్కుమనకుండా నీవో యింటివాడి వయ్యావంటే మాకు కావలసింది ఏమిటి చెప్పు! సంతోషంగా నీకు బిడ్డలు పుడితే చూసుకుని మురియడంగాని?—

"అమ్మ ఎంత ఇదవుతోందనుకున్నావు? నీతోటి వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయి - పిల్లలతో సంతోషంగా వున్నారనీ-నావాడు యింకా అల్లాగే వున్నాడనీ" - చాలా బాధపడుతూంది. మొన్ననే చక్కని సంబంధం ఒకటి వచ్చింది. ఎర్రగానూ - అందంగానూ కూడా వుంటుందని తెలిసింది - పిల్ల చదువుతూందట కూడానూ, యిద్దరికీ ఈడూజోడుగా వుంటుందట. నువ్వు నామాటకు అడ్డు చెప్పక వెంటనే నాలుగు రోజులు కాలేజీకి శలవుపెట్టి-ఇంటికి రా! అన్ని విషయాలూ మాట్లాడుకోవచ్చును. తప్పక బయలుదేరి వస్తావని తలుస్తాను! వస్తావు కదూ....?—

ఆశీస్సులతో,
తండ్రి - వీరయ్య.

ఉత్తరం చదువుకున్నంతసేపూ భాస్కరం మరో ప్రపంచంలో వున్నాడు- తనకు వివాహం! ఎలాగ!! ఇంతక్రితమే సుశీలకు మాట యిచ్చాడు! సుశీల ఆనాటిమాటలు భాస్కరం హృదయంలో గజ్జలుకట్టి నాట్యం చేస్తున్నాయి. కళ్ళముందర సుశీల ఎర్రని పెదిమలు నిగనిగ

మెరుస్తూ, నవ్వులు కురుస్తున్నాయి- చెవుల్లో స్వాగతగీతికల ధ్వనులు వినబడుతున్నాయి- సుశీల! అదిగో!! ఎదురుగా కనిపిస్తూంది." నిన్ను తప్ప ఇంకొకరిని వివాహమాడను"- భాస్కరం వుత్తరాన్ని క్రిందపడే శాడు నిర్జీవప్రతిమలాగ నిలుచున్నాడు. అనేక ఆలోచనలు కళ్ళముందు కరాళనాట్యం చేస్తున్నాయి. ఏమిటో! ఎవరో ప్రశ్నలు అడుగుతూన్నట్లు బాధపడుతున్నాడు." నీది ప్రేమా? ప్రేమంటే నీవాంఛ చల్లార్చగల శక్తి అనేనా నీవూహ! నీకళ్ళముందర కనబడిన స్త్రీని, నీ అంతర్గత వాంఛల ఒత్తిడితో చూసి, కావాలనికోరి, నీవాంఛాఫలసిద్ధికై "ప్రేమ"- అని నామకరణం చేస్తున్నావా?"- భాస్కరం నరాలు ఉప్పొంగాయి! కళ్లు కణకణ మండుతున్నాయి.

"మాట తప్పడం నాగరికలక్షణం అనిపించుకుంటుందా?"- అంత రాత్మ ప్రశ్నించింది.

అది ఎన్నటికీ కాదు! ప్రతిఫలాపేక్ష లేనిప్రేమే నిజమైన, ఆదర్శ మైన ప్రేమ."- భాస్కరం అంతరాత్మ ప్రతిగా సమాధాన మిచ్చింది.

దసరా సెలవులకు సుశీలా, తనూ వెళ్ళినప్పుడు చేసుకున్న ప్రతి జ్ఞలు మరువగలడా?- ఒకవేళ మరచినా ఆకాశాన నెలరాజు ఆ జంటను తన నిండుహృదయంతో ఆశీర్వదించాడే:-

అవును! "చందమామ సాక్షిగానేకదూ సుశీల చేతిలో భాస్కరం చెయ్యివేసింది"- తన పాత అనుభవాలను కళ్ళముందుకు తెచ్చుకున్నాడు భాస్కరం! వెంటనే ఒక నిశ్చయానికి వచ్చాడు!- బయలుదేరి వెళ్ళి తండ్రితో "యీ వివాహం వల్ల కాదని చెప్పాలి"- అని!

* * *

సుశీల భాస్కరం క్లాసుమేటు కాదుగాని ఒకే కాలేజీలో చదువు కుంటున్నారు. ఇద్దరూ. ఒకే జిల్లావారు సకల కళలకూ నిలయమై; నందనోధ్యానవన సౌందర్యశోభితమై ప్రకృతి సంపదకు ఖనియై; గోదా వరీ ముఖానవున్న కోనసీమ కోటిమెరక కొబ్బరితోటల కోతికొమ్మచ్చు లాడినవారే!

ఒకరోజున కాలేజీలో వక్తృత్వపోటీ జరుగుతూంటే తనూ పాల్గొందామని వెళ్ళింది సుశీల. ఉపన్యాస వేదికమీద ఒక యువకుడు "స్త్రీకి విద్య ఎంతదాకా అవసరం" - అనే విషయంమీద చాలా గంభీరంగా మాట్లాడుతున్నాడు। సుశీలనుకూడా మాట్లాడమని తోటి ఆడపిల్లలు ప్రోత్సాహించారు - గుండె దిటవుచేసుకుని సుశీలకూడా మాట్లాడింది। ఆ టాపిక్‌మీద చాలా బాగా మాట్లాడిందని సుశీలను అందరూ అభినందించారు. అందరితోపాటు భాస్కరంకూడా వచ్చి- "చాలా బాగా మాట్లాడావని, విద్యార్థినీ లోకంలో ధృవతారవై మార్గదర్శకురాలవు కాగలవని ఆశిస్తున్నా"నని చెప్పాడు.

భాస్కరం వేదికమీద గంభీరంగా వుపన్యసిస్తూ - తన మేధాశక్తి చేత అందరినీ ఆశ్చర్య చకితులను చేస్తున్నప్పుడే సుశీల లేతహృదయంలో ప్రథమంగా ఆనందంచిందులు త్రొక్కింది - ఆ ఘడియనుంచే సుశీలకు భాస్కరంమీద గౌరవ పురస్సరమైన ప్రేమ జనించింది. భాస్కరుని కిరణాలు సుశీలను తాకి మెరుపెక్కించినవి। భాస్కరం హృదయంలో ఆనందం జలకమాడింది।।

ఆ రోజునుంచి ప్రతి విషయంలోనూ సుశీల భాస్కరం వద్దకు వస్తూపోతూ వుండడం- కల్చరల్ యాక్టివిటీస్‌లో భాస్కరంతో కలిసి పాల్గొంటూండడంకూడా జరుగుతూండేది.

ఇల్లాగవుండగా- "దసరాసెలవులకు బయలుదేరి రాజమండ్రి తప్పక రావలసిందని" పుట్టింటినుంచి సుశీలకు లేఖవచ్చింది. అంతవరకూ భాస్కరంమీద తనకున్న గౌరవచిహ్నంగానే వుంది, ఆప్రేమ। కాని చంద్రకళల దశలమాదిరి అభివృద్ధికూడా లేకపోలేదు।

తను బయలుదేరి వెళ్ళడం- అందులోనూ ఒక్క సుశీలకు చాలా కష్టంగా కనుపించింది. అందుకు భాస్కరాన్ని తన వూరురమ్మని సాభిప్రాయపూర్వకంగా మిత్రత్వపు అధికారంతో- ఆహ్వానించింది.

భాస్కరం। ముందర వీలుపడదని, ఏవో పనులున్నాయని వంకలు చెప్పి తప్పించుకోజూచినా సుశీల పెదిమలనుండి- "ఏం

భాస్కరం!" అన్న ఆశాపూరితధ్వని వినేటప్పటికి తనకు తెలియకుండానే అంతర్గతంలోంచి వసంతఋతు చల్లనిగాలి శ్రావ్యనిధిలాగ- "సరే"- అన్న సమాధానం వచ్చింది!

సుశీలముఖం ఆ సమయంలో మెరసి, మురిసి, వెన్నెలలు కురిసింది!

* * *

చందమామ ఆకాశంలో ముఖం చాలా పెద్దదిగా చేసుకుని నీలి మేఘాలతో దోబూచులాడుతున్నాడు.

భోజనాలు పూర్తయ్యాయి! అప్పుడే కడుతూన్న కొత్తడాబామీద భాస్కరానికి, తనకూ ప్రక్కలు వేసింది సుశీల.

ప్రకృతి చాలా ముభావంగా వుంది! అప్పుడప్పుడు గోదావరి బ్రిడ్జిమీద నడిచే ధూమశకటాల రణగొణధ్వనులు తప్ప!

భాస్కరం సుశీలతో ఇంతచనువుగా కలిసి మాట్లాడడం యిదే ప్రధమం! సంఘం, సమాజం, తనను అనుమానించి పొంచిచూస్తాం దేమోనని తనలో కొంచెంగా మిగిలివున్న భీతిభయముతో వెనుకకు లాగుతుంది. "బూజుపట్టిన సంఘమర్యాదలకు బానిసత్వం వహించక విశాలతతో ముందుకు నడు"- బలంగా అంతరాత్మ వుత్సాహపూరితుణ్ణి చేస్తుంది!!

"సుశీ" - ఒక పిలుపు పిలిచాడు. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ భాస్కరం!

అంతవరకూ ఏదో ఆలోచిస్తున్న సుశీల ఆప్యాయంగా భాస్కరంవంక చూస్తూ కళ్ళతో భాస్కరాన్ని పలకరిస్తోంది! "మనం పరీక్షలకోసం చాలాశ్రద్ధగా చదవాలి. నీవు వ్రాసి నాపుస్తకంలో వుంచిన నీ అంతరాత్మ సాక్షీభూతమైన వుత్తరాన్ని చూచాను. ప్రతి అక్షరం నన్ను కిచకిచలు పెట్టాయి. ప్రతి వాక్యం నాలో నవ్వులు వర్షించాయి.

నీసంతకం నన్ను ప్రేమగా పలకరించింది! సుశీ!! –" అన్నాడు భాస్కరం!

ఈ మాటలకు సుశీల సిగ్గుతో తలవంచేసుకుంది.

"సుశీ! నీ వుత్తరంలో మనం వివాహం చేసుకుంటే...." అని అడిగావు? కాని ఇది సమయంకాదని నావూహ! మన స్టడీస్ పూర్తయ్యాక ఏదయినా ఆలోచిద్దాము! అంతదాకా...." అన్నాడు భాస్కరం!

"అంతదాకా ఆగడం ఎందుకు?" - సుశీల అడిగింది.

"అది అంతబాగా వుండదు! స్టడీస్ పూర్తయ్యాక...." అన్నాడు భాస్కరం భవిష్యత్‌కేసి ఆశతో చూస్తూ! సుశి ఏమీ మాట్లాడలేదు!—

ఇంకా ఏమిటో ఆలోచిస్తున్నావు "ఇదుగో సుశీ! ఆచంద్రుని తోడుగా నీకు మాట యిస్తున్నాను, భాస్కరం బొందిలో ప్రాణం వుండగా ఇంకెవరినీ వివాహం చేసుకోడని! ఇదుగో చేతులో చెయ్యి" - ఒకరి చేతులో ఒకరి చెయ్యి వేసుకుని, ఒకరి హృదయంలో ఒకరు ప్రతిజ్ఞాపత్రంలో సంతకాలు చేసుకుని, ఒకరి ఆశయంలో ఒకరి ఆశయాన్ని జతచేసి, తమ అంతర్గత శక్తుల ప్రోత్సాహంతో ఒకనిర్ణయానికి వచ్చారు! దసరా సెలవులు పూర్తి అయ్యాయి. మద్రాసు తిరిగి ఇద్దరూ చేరుకున్నారు - ఇది భాస్కరం ప్రథమ పరిచయం.

* * *

సుశీలకుకూడా భాస్కరానికి జాబువచ్చిన సమయంలోనే ఒకటి రెండు రోజులు అటూయిటూగా వుత్తరం వచ్చింది.

"పెళ్ళివారు చూచుకోడానికి వస్తున్నారనీ, పెళ్ళిమాటలు జరుగుతున్నాయని, రెండు మూడుదినాలు సెలవు తీసుకుని బయలుదేరి రావలిసిందనీ?"-

తల్లిదండ్రులు పెళ్ళిచూపులకు రమ్మని వ్రాసినజాబు చదివేటప్పటికి ముచ్చెమటలు పోశాయి సుశీలకు! "పాపాలకు ప్రతిఫలంగా చీము నెత్తురు కలయికలతో ప్రవహించే వైతరణీనదిలో ఈదులాడుతున్నానా"?

అని తనలోతాను భయపడిపోయింది. కోటి అమావాస్య చీకటిరాత్రులు మీద కురికినట్లుగా వణకసాగింది!

ఏంచెయ్యడానికి తోచక వెంటనే భాస్కరం రూముకు బయలు దేరింది సుశీల. తను వెళ్ళేటప్పటికే భాస్కరం కాలేజీనుంచి ప్రయాణమై తన స్వగ్రామం వెళ్ళిపోయాడు.

ఏ విషయంవున్నా భాస్కరం సుశీలకు చెప్పకుండా వెళ్లేవాడు కాదు- కాని ఈనాడో? పెళ్ళిచూపుల విషయం! సుశీలకు ఈ విషయం తెలిస్తే ఏంబాధ పడుతుందో? ఏం అభిప్రాయపడుతుందో అనేభయంతో సుశీలకు తెలియకుండా- రహస్యంగా బయలుదేరి వెళ్ళాడు!

భాస్కరం చెప్పకుండా వెళ్ళినందుకు సుశీల చాలా బాధపడింది! ఈ సమయంలో లేకపోయినందుకు నిరుత్సాహంతోటే తన గ్రామం బయలుదేరింది సుశీల.

"గాలిపడగ ఆకాశవీధిలో రివ్వున ఎగురుతూంది. ఆకాశతారకల్ని ముద్దెట్టుకుంటోంది. అరుణకాంతుల జిమ్ము మేఘాలమధ్యన తన అందాన్ని చూసుకుని మురిసి నాట్యమాడుతూంది."- రైలుబండి కిటికీ లోనుంచి సుశీలకు కనపడిన ఒకదృశ్యం!

కొంచెంసేపు దృష్టి మరలించిన సుశీల తిరిగి కిటికీలోనుంచి అదేవంక చూస్తూంది. ఆ గాలిపడగలాగానే తన ఆశయాలు హిమగిరి వరకూ ఎగిరి ఫలించపోతున్నాయని ఎన్నో గాలిమేడలను కట్టుకుంది! పగటికలలను కని- తాత్కాలిక ఆనందాన్నిపొంది- తనూ గగనవీధిలో ఆనందంతో- ఆహ్లాదంగా విహరిస్తూంది!

ఇంతలో గాలిపడగ దారంతెగి క్రిందపడిపోవడం దృశ్యం కంట పడేటప్పటికి తన జీవితంకూడా యిటువంటి అవాంతరాలను. తుపానుల్ని కష్టాల్ని ఎదుర్కోవలసి వస్తుందేమోనని భయపడిపోయింది.

తన తల్లితండ్రులు పెళ్ళికి ఏర్పాట్లు చేస్తున్నారు. పెళ్ళిచూపులకు రమ్మని జాబుకూడా రాశారు! ఎవరో? ఎల్లాగో? - ఏవిధంగా ఈ సమ

యంలో భాస్కరం మాటను చెల్లించటం?- అనుకుంటూండగానే ధూమ శకటం పొగలు చిమ్ముకుంటూ గోదావరి స్టేషన్‌లో ఆగింది. అంత వరకూ అంతర్గత పోరాటంలో మునిగివున్న సుశీల ఒక్కసారిగా లేచి బరువెక్కిన హృదయంతో బండినుండి దిగింది - మెల్లగా నిరుత్సాహంతో యిల్లు చేరుకుంది।

*  *  *

ఇక తెల్లవారితే పెళ్ళిచూపులు।

సుశీలలో నిరుత్సాహం కన్నతల్లికి కనపడసాగింది - ''ఏమే సుశీలా? అలాగ వున్నావు?''అని సుశీలను చూసి అనుమానంతో వుండలేక కన్నతల్లి మాటల సందర్భంలో అడిగింది.

లేని మెలుకువను తెచ్చుకుని - ''అబ్బే! ఏంలేదూ. ప్రయాణం బడలిక'' - అంది ముభావంగా సుశీల।

ఈ సమాధానం తల్లికి సంతృప్తి కలిగించలేకపోయినా-విసిగించడం యిష్టంలేక - అంతటితో ఆ విషయాన్ని మళ్లించింది తల నెరసిన సుశీల తల్లి!

సుశీలకు పెళ్లి సంబంధం వెతుక్కొచ్చింది - తన పినతండ్రి వెంకట్రామయ్యగారు। వారి యింటనే - రాజమండ్రికి రెండుమైళ్ళ దూరంలో వున్న ధవళేశ్వరంలోనే పెళ్లిచూపులకు స్థల నిర్ణయంకూడా చేశారు.

*  *  *

భాస్కరం యిల్లు చేరుకున్నాడు ''తనకు ఎంతమాత్రమూ ప్రస్తుతం వివాహం వద్దని, యింకా స్టడీస్ వున్నాయనీ, అందుకు పెళ్లిప్రయత్నాలు విరమించమని'' - తల్లితండ్రులను కోరాడు। ప్రాధేయపడ్డాడు కూడాను.

అందుకువారు ''పిల్లనచ్చితే అంతవరకూ ఆగి తరువాతే వివాహం చేసుకోవచ్చుననీ - పెళ్లిచూపులకు ధవళేశ్వరం వెళ్ళవలసిందేనని''-

చెప్పారు! కాదనలేక ధవళేశ్వరం వెళ్ళి, మ్రొక్కుబడి తీర్చి వద్దామని బయలుదేరాడు భాస్కరం,

అక్కడ సుశీల "ఏలాగైనా ఈ బలవంతపు పెళ్ళిచూపులనుంచి బయటపడాలనీ- అందుకోసం ఏదోఒక వుపాయం ఆలోచించాలనీ"- మనసులో మహాయజ్ఞం చేస్తూంది!

సుశీలను ధవళేశ్వరం పెళ్ళిచూపులకు సాగనంపుతూ "సుశీ! వచ్చేవాళ్ళ పెళ్ళిచూపులకు సుమా! చదువుతున్నదానివిలాగ, చురుకుగా కనపడాలి"- అని బోధచేసింది తల్లి!

* * *

భాస్కరం ఈ పెళ్ళిచూపుల లాంచనం ఎప్పుడు ముగుస్తుందా? ఎప్పుడు బయటపడదామా? అనుకుంటూ బాధపడుతున్నాడు!

సుశీల చక్కని ముస్తాబుతో పినతల్లి బలవంతంమీద వచ్చి కూర్చుంది.

సామాన్యంగా స్త్రీలలో- అందులోనూ పెళ్ళిచూపుల సమయంలో కనబరిచే మొదటిగుణం- సిగ్గు! ఆ సిగ్గే సుశీలలో మెరిసింది.

సుశీల పెళ్ళి అనే సరదాతోకాదు అక్కడ కూర్చున్నది; సుశీల ఆనంద తరంగాలలో తేలియాడడంలేదు. యమభటులు బలవంతంగా తన మెడకు "పుస్తె" అనే పాశాన్ని వేయబోతున్నారనే మరణ వేదన పడుతూంది-గుండె ఆందోళనతో, ఆవేశంతో తుప్పుపట్టిన గోడగడియారంలాగ ఫాస్ట్‌గా కొట్టుకుంటుంది. చిలుము పట్టిన మెయిన్ స్ప్రింగులాగ తన ఆశలు మధ్యలో - ఈ ఘడియలో తెగిపోయి తన జీవిత గమన గడియారాన్ని మూలకు నెట్టుతూన్నట్లు బాధపడుతూ - కనులనుండి వేడిగా అశ్రుకణాల్ని రాల్చింది ఎవరైనా చూస్తారేమోనని వణుకుతూన్న పెదిమలను పంటితో అణిచి పెట్టుకుంది! - సుశీల.

"భాస్కరానికి ఈ పెళ్లిచూపులు, యీ తతంగం తెలిస్తే ఏమనుకుంటాడో! ఏ విధంగా ఈ తతంగంనుంచి బయటపడడం?" - అనుకుంటూ వణికిపోతుంది సుశీల!

"ఏం అమ్మాయి! ఎంతవరకు చదువుకున్నావు- తల ఎత్తకుండా సన్నని కంఠంతో మొక్కుబడి తీర్చుకోవడంకోసం ఒక ప్రశ్న పెళ్ళికొడుకు హోదాలో వేశాడు భాస్కరం.

"మద్రాసు....కాలేజీలో యింటర్ ఫస్టియర్ చదువుతున్నాను"_

"నీపేరు?"_భాస్కరం రెండవ ప్రశ్న.

"సుశీల"_అంది ముఖాన్ని వంచేసుకుంటూ.

తను ప్రేమించిన అమ్మాయిపేరుకూడ సుశీలే - ఆమాట చెవిని పడేటప్పటికి భాస్కరం హృదయం చిగురించింది; ముఖం వికసించింది.

పెళ్ళిచూపుల కోసం అలంకరించబడి వున్న సుశీల సూనాయాసంగా గుర్తించడానికి వీలులేకపోయినా ముఖంమాత్రం భాస్కరం గుర్తించకపోలేదు - నిజంగా సుశీలే. ముమ్మాటికీ సుశీలే. పూర్తిగా నమ్మకం కలిగింది భాస్కరానికి - సంతోషం గట్టుతెగిన గోదావరిలాగ పరవళ్ళు తొక్కింది.

"సుశీ!" - అని గొంతెత్తి నోరారా పిలుద్దాం అనుకున్నాడు. కాని అంత తొందరపడడం బాగుండదని నిర్ణయించుకున్నాడు- మనసు మాత్రం చిరుకెరటాలు వేస్తూనే వుంది.

"మీపేరు భాస్కరంకదూ!" - అంది ఆడపిల్ల తరపు పెద్దరికపు హోదాలో సుశీల పినతల్లి.

"అవును!".... అన్నాడు భాస్కరం. తిరిగి రెండవ ప్రశ్న వేయకుండానే—" నేను మద్రాసు—కాలేజీలో చదువుతున్నాను"— అర్ధమయ్యే టట్లుగా.

అంతవరకూ నిరాశతో కూర్చున్న సుశీలకు ఒక్కసారిగా ఆనం దంతో ముఖాన్ని పైకెత్తి కళ్ళతో చిరునవ్వును చిలకరిస్తూ, పెదిమలతో భాస్కరాన్ని పలుకరిస్తూ. చూపులతో కిచకిచలుపెట్టింది. ఒకరిని ఒకరు గుర్తించుకున్నాక ముఖాలు వికసించి హృదయాలు చిగిర్చాయని వేరే చెప్పడం దేనికి?- పెళ్ళిచూపులు పూర్తయ్యాయి

"పిల్ల నచ్చిందని—తప్పక వివాహంచేసుకుని మీకోరికను మన్నిస్తాననీ తండ్రితో చెప్పాడు భాస్కరం! అందుకు తండ్రికూడా ఇష్టంగానే మాట్లాడాడు. కాని తల్లిమాత్రం- "పిల్ల తనకు ఎంతమాత్రం నచ్చలేదని, కాలేజీలో చదువుకున్న పిల్లగానైనా కన్పించలేదని-" అంటూ అయిష్టతను అసంతృప్తిని వెల్లడించింది.

పెళ్ళిచూపులు జరిపించిన సుశీల పినతండ్రి "పిల్లవాడు నాజూకుగా బాగానే వున్నాడనీ, సుశీలకు అన్నివిధాలా తగినవరుడు భాస్కరమే ననీ-" చెప్పాడు!

* * *

అప్పుడే భోంచేసి కూర్చుకున్నాడు సుశీలతండ్రి!

"ఏమండీ పిల్ల రేపు కాలేజీకి పోవాలట - ఏం ఆలోచించారు? ఏం నిర్ణయం చేశారు?"- అని అడిగింది సుశీల తల్లి భర్తను.

"భాస్కర్రం విషయం అన్నీ బాగానేవున్నాయి! నేను తప్పక అతనికే సుశీలనిచ్చి వివాహం చేయాలని అనుకున్నాను. కాని యింతలో అసలు సంగతి తెలిసింది. వీరయ్యశర్మ అతని ధర్మమని రాశాడు. ఎవరికి పట్టింది ఈ కలికాలంలో ముక్కానీ ఖర్చుచేసి సలహా యివ్వడానికి? అతడు చాలా మంచివాడుకనుకగానీ!

ఇదిగో! వుత్తరం-చదివి మరీ నోరుమెదపండి!" అంటూ ఆ వుత్తరాన్ని భార్యముఖంమీద పడేశాడు సుశీల తండ్రి!

ఈ వాతావరణం చూస్తూంటే రైలుక్రిందపడ్డ జీవి ప్రాణంలాగ కొట్టుకో సాగింది సుశీల ప్రాణం!

...."బ్రహ్మశ్రీ సుబ్బారాయుడు బావగార్కి.... వీరయ్యశర్మ నమస్కరించి వ్రాయునది।

రెండురోజులు క్రిందట మా పెద్దచెరువులో సంధ్యావందనం చేసుకుంటూండగా - మీ సుశీలకు వివాహ ప్రయత్నాలు జరుగుతున్నాయని, సంబంధం మా గ్రామంలోనే, భాస్కరం అనే కుర్రవానికి నిశ్చయించబోతున్నారని బట్టలుతుక్కుంటూ చెప్పుకుంటూన్న ఆడవాళ్ళద్వారా విన్నాను - చాలా ఆశ్చర్యపోయాను.

భాస్కరం అన్ని విషయాలలోనూ చాలా తెలివైనవాడు - పరోపకారి - మంచివాడు। అంతమాత్రంచేత సుశీలను అతనికి నిశ్చయించడం చాలా తొందర పనేమోనని నా నమ్మకం! ఎందుచేతనంటారా? అతనిమీద సంఘానికి చాలా కక్షవుందట—

ఇటువంటి పరిస్థితిలో రత్నంలాంటి సుశీలను అతనికి ముడేసి అమ్మాయి జీవితాన్ని భగ్నంచేయ వద్దని మిమ్ములను చాలా కోరుతున్నాను"—

ఇట్లు.
వీరయ్యశర్మ

ఆ వుత్తరం చదివిన సుశీలతల్లి ఏమనాలో, ఏం చేయాలో అర్ధంకాక - కంటతడి పెట్టుకుంటూ లోనికి వెళ్ళిపోయింది। సుశీలకూడా ఆ ఉత్తరాన్ని పూర్తిగా చదివింది - బాధతో - సహించలేక చురచురలాడిపోయింది.

"ఒకరు బాగుపడితే-పచ్చగా వుంటే హర్షించి ఆనందించలేని ఈ సంఘం సంఘమా?-" అని ఎంతో ఆవేశపడింది।

ఇంక ఒక్కనిమిషంకూడా ఇక్కడ వుండకూడదు అనుకొని బయలుదేరి వెళ్ళిపోవటానికి నిశ్చయించింది సుశీల।

"ఏం సుశీలా!"- తండ్రి చాలా ఆప్యాయంగా పలుకరించాడు.

"అబ్బే! నేను రేపు కాలేజీకి వెడుతున్నాను"—

"వెడుదువుగానిలే! ఇంత తొందర ఏమిటీ?"—

"మూడురోజులేకదూ నేను లీవుపెట్టింది!"—

"సరే! అల్లాగే వెడుదువుగానిలే"- అన్నాడు తండ్రి.

కొంతసేపు పెదిమలను మెలిపెడుతూనుంచుని సుశీల!

"ఏం నిశ్చయించారా...."— అని అంది సిగ్గు, బెదురుల సమ్మేళనంతో!

ఈ మాట సుశీల నోటినుండి పూర్తిగా బయటకు రాకుండానే తండ్రి!

"ఆవూరునుంచివచ్చినవుత్తరం చదివావనుకుంటాను! తెలుసుండి అతనికి చేతులారా వివాహంచేయడం? చెయ్యను-చెయ్యలేను"- నోరు పెద్దది చేసుకుని కోపంగా అన్నాడు!

ఈలాటి సమాధానం తన తండ్రినుండి వస్తుందని తలవని సుశీల సహించలేక పోయింది.

"నాన్నా! క్షమించు! నీ బిడ్డగౌరవంగా బ్రతకాలంటే! నీ కళ్ళకు కనిపించాలంటే ఈ వివాహానికి ఇష్టపడండి"- అంటూ కళ్ళనీళ్లు బొటబొటా కారుస్తూ బావురుమని తండ్రి పాదాల మీద పడింది- ఎరు పెక్కిన ముఖంతో.

తన కడుపున పుట్టిన సుశీల-తన కళ్ళముందరే ఎదురు తిరగడం-చూస్తూ ఏ తండ్రి పూరుకో గలడని తనలో తాను ప్రశ్నించుకుని-నర సింహావతార మెత్తాడు! "ఏమైనా భాస్కరంతో సంబంధము వల్లకాదు"-అన్నాడు-అదే తన నిర్ణయమని నోరెత్తి మరీ గర్జించాడు!

* * *

సుశీల మద్రాసు చేరుకుని అప్పుడే పదిరోజులైంది. ఏదో ఘోర తప్పిదం చేసినట్లు-భాస్కరాన్ని కన్నెత్తైనా చూడకుండా-బాధతో క్రుంగి

పో నారంభించింది. పుట్టింటికి ఒక్క జాబైనా వ్రాయలేదు - సుశీల వద్దనుంచి జాబురానందుకు గుండెనిబ్బరంతో తండ్రి పూరుకున్నా కన్న కడుపు కాబట్టి తల్లిమాత్రం చాలా బాధపడింది!

ఆరోజు కాలేజీ మంత్లీ డిన్నర్! సుశీలా వచ్చింది. భాస్కరం కూడా హాజరయ్యాడు-మునపటి మాదిరిగా మాత్రంకాదు-ఇంతక్రితం డిన్నరు వచ్చిందంటే ఒకటేబిల్‌ముందు కిచకిచలతోటి పకపకలతోటి యిద్దరూ ఎంతో ఆనందంగా సరదాగా వుంటూండేవారు! కాని ఈనాడు? సుశీల ఒకమూల, భాస్కరం ఒకమూల. నిరుత్సాహంగా కూర్చున్నారు ఆ రోజుడిన్నరు వెలవెల బోతున్నదని చెప్పాలి!

డిన్నరు పూర్తయింది! ఎవరిగమ్యాలకు వారు చేరుకుంటున్నారు. భాస్కరం కూడా బలవంతంగా లేచి అడుగులో అడుగు వేసుకుంటూ-ఆలోచనా నిమగ్నుడై - నడుస్తున్నాడు - యింతలో "భాస్కర్"- అని సన్నని స్త్రీ కంఠం వినబడింది, ఆ కంఠం పరిచిత కంఠమే. భాస్కరం దగ్గరగా వచ్చి నుంచుంది! సుశీల - ఏదో మాట్లాడదామనే వచ్చింది - అంతవరకూ లేనిభీతి - భయమూ - అడ్డుగా నిలుచున్నాయి!

"ఏం సుశీ!" అన్నాడు భారమైన శ్వాసను విడుస్తున్నట్లు భాస్కరం!

"....    ....    ....    ....    ....    ...."

"సరే! రా! రూముకు వెళదాం!" అన్నాడు. భాస్కరం:

యిద్దరూ నడక ప్రారంభించారు.

"ఏం అలా భారంగా వున్నావు?-"

"ఏంలేదు! బ్రతుకే భారంగా వున్న ఈ సమాజం ముందర సుశీల బ్రతికి ఏంలాభమా - అని ఆలోచించుచున్నాను."

"అవును! బూజుపట్టిన సంఘం మనమీద విరుచుకు పడుతూంటే చేతులు కట్టుకుని, నిస్పృహతో-కూర్చోవడమేనా? సుశీ-కర్తవ్యం?...."

మానవుడు పురోగమించాలి! బూజుపట్టిన పాత సాంప్రదాయాలను వెనుకకు నెట్టి-సంఘ పురోభివృద్ధికోసం ముందుకు నడవాలి - అమరకవి గురజాడ, వీరేశలింగంగార్ల అమర సందేశాలమగొంతెత్తి పాడుకుంటూ- ముందుకు చొచ్చుకు వెళ్ళాలి!" అని భాస్కరం తట్టి మేల్కొలిపాడు సుశీలను।

నిజంగా భాస్కరం పలికిన ప్రతిపలుకు - ప్రతి అక్షరం సుశీల హృదయంలో మధుర వసంతాన్ని వర్షించిందనే చెప్పాలి!

"సిగ్గుతెరల చాటునుంచి ఏమి ఆలోచించారు" - అంది సుశీల!

"మన ఆలోచనలూ, నిర్ణయాలూ, యంత్రికృతమే జరిగినవి కదూ ?" - అన్నాడు భాస్కరం।

భాస్కరం అన్న ఆశాపూరిత సమాధానానికి ఎంతో ఆనంద పడింది సుశీల।

# సరిహద్దు!

ఇంకా ఆరునెలలు తిరిగిందో లేదో "అమావాస్య చీకటికి కారు మబ్బులు తోడయినట్లు" కుటుంబంలో అన్నదమ్ములమధ్య కోడళ్ళ పుణ్యమా అని పొరపులు బయలుదేరాయి. కలకలలాడే వుమ్మడి కుటుంబం నాలుగు ముక్కలై పోయింది. వెంకన్నగారి కొడుకు రామన్న అనుకోకుండా పసిపిల్లలను భార్య వెంకమ్మగారికి అప్పజెప్పి తనువు చాలించాడు.

రామన్న తమ్ముడు సుబ్బన్నకి అన్నగారంటే మొదటినుంచి భక్తి, విశ్వాసాలు గలమనిషి. అందులోనూ అ-ఆ-లు దిద్దించి అన్న రామన్న దగ్గరే ఆస్తులు పంచుకుని దూరమయినా వదిన వెంకమ్మగారింటికి వస్తూ పిల్లళ యోగక్షేమాలు, అన్న కుటుంబ వ్యవహారాలు తనే చూస్తున్నాడు.

వెంకమ్మగారంటే మరిది సుబ్బన్నకు, సుబ్బన్నంటే వదిన వెంకమ్మగారికి మొదటినుంచీ ప్రేమ, చనువు కూడాను! అక్కడిదాకా ఎందుకు? వదిన మజ్జిగ చేస్తూంటే కవ్వానికు అడ్డుపడి వెన్న తినేవాడు మరిది సుబ్బన్న! అంతచనువు కలిగిన సుబ్బన్న అన్నంటే దూరమయాడు కాని - అన్న కుటుంబమంటే ప్రేమ ఎక్కడ ఛస్తుంది? ఏక కడుపుని రక్తం పంచుకుని పుట్టిన సహోదరులు వాళ్ళు!

సుబ్బన్న వ్యవహారాలు ఎంతచూస్తున్నా బిక్కుబిక్కుమంటూ ఆ పెరటి పాకలో కిరసనాయిలు దీపం వెలుగు మధ్యన పసిపిల్లలతో ఎల్లాగ వుండగలదు వెంకమ్మ?

ఇల్లు అయితే నాలుగిళ్ళ భవంతే! యింటి ఎదురుగుండా వున్న బ్రహ్మన్నగారు వేలంలో ప్రోత్సహించి కొనిపించారు. సునాయాసంగా మూడు కుటుంబాలు కాపురం వుండొచ్చు. కాని రామన్నగారు చనిపోయిన రోజు మంచిది కాకపోవడంవల్ల రెండు సంవత్సరాలు యింటిని వదిలివేయవలసి వచ్చింది అందుకే యింటినానుకొని వున్న పెరటి పాకలో కాపురం!

పుట్టింటివారిది ఆపూరే అవడంచేత పిల్లలను తీసుకుని తండ్రిగారింటికి బయలుదేరి వెళ్ళింది వెంకమ్మగారు.

అది పన్నెండు గంటల సమయం! ఆరోజు పోళారమావాస్య. యింకా యింట్లో అడుగుపెట్టిందో లేదో? రాకాసిలాగ తల్లి సూరమ్మ గుమ్మంవద్దనే ఎదురై "వచ్చావూ? యేం? మీనాన్న యాగ్నికాల బాపతు సొమ్ము బియ్యం. నీ ముఖాన మాకు తెలియకుండా తగలేస్తున్నా చాలక యింటికి తగలడ్డావు"— అంటూ కూతురు వెంకమ్మను నానామాటలూ అంది!

అసలే కష్టాల్లో చిక్కుకుని, బాధలతో గుండె అదిరిపోయిన వెంకమ్మగారు ఏమీ సమాధానం చెప్పక లోలోపలే విధినితిట్టుకుంటూ కంట తడిపెట్టుకుంది.

తన రోజులు అల్లాగవుండి భర్తపోవడం, పెళ్ళయి ఎంతోకాలం గడవకుండానే కూతురు వైధవ్యం అనుభవించవలిసి రావడం - పొన్నకాయల్లాగ పిల్లలు - యీ స్థితిలో తన తండ్రి పంచనజేరింది. - పెరట్లో భయంతో ఒక్కఆమె వుండలేక!

తనతల్లి, తనను పిల్లల్ని, మాటిమాటికి, అడుగడుక్కి తిట్టి వేధిస్తున్నా ఒక్కమాటైనా అనకుండా తనలోతాను - తన భర్త, కూతురు భర్త జ్ఞప్తికి వచ్చినపుడల్లా తన మాంగల్యాన్ని నెమరు వేసుకుని లోలోపలే ఎంతో దుఃఖించేది. యిటువంటి కష్టాలు వస్తాయనైనా తెలియదే అని వెక్కివెక్కి ఏడ్చేది ఎవరైనా చూస్తారేమోనని వస్తున్న

ఏడుపుని లోలోపలే అణచి పెట్టుకునేది. తన భర్తవుంటే యీ దెప్పి పొడుపులు దయాదాక్షిణ్యాలు వుండేవికావుకదా అని తన దురదృష్టానికి ఎంతో చికాకు పడేది! అంతకు మించి స్త్రీ యేంచేయగలదు కనుక ?-

వెంకమ్మగారంటే తండ్రి జగన్నాధానికి చాలా ప్రేమ, గౌరవము కూడాను. అందుకు ప్రత్యేక కారణం లేకపోలేదు. తనకు పెద్దకూతురు వెంకమ్మ పెళ్ళయి కాపురానికి వెళ్ళేవరకు తనకు ప్రతిపని లోను కుడి భుజంగా వుండేది. అవసర సమయాలలో చటుక్కున మంచి మంచి సలహాలుకూడా యిస్తూండేది. తను ఎక్కడికైనా వెడితే తోటకు వెళ్ళి పాలుపిండి తెచ్చి మొగపనిని కూడా చూచేది - అటువంటి కూతురు వెంకమ్మగారంటే ప్రేమ ఎక్కడికి పోతుంది? అందుకు వెంకమ్మ గారిని, పిల్లలను, కష్టంలో వున్నారనే అభిమానంకొలది ఎంతో శ్రద్ధగా చూస్తూ భార్య, కోడలు చేసే తతంగాన్ని చూసి కసరుకుంటూ వుండే వాడు!

ఇల్లాగ వుండగా ఒకనాడు తండ్రి జగన్నాధంగారు పనిమీద బయటికు వెళ్ళారు, తల్లి సూరమ్మ యిదే సమయంకదా అని కూతురు వెంకమ్మని నానామాటలూ ఆడింది - అంతటితో చాలించక ఏమీతెలియని పసిపిల్లలను కూడా నానామాటలూ ఆడింది. మహాయిల్లాలు వెంకమ్మ! పాపం నోరెత్తి అయినా సమాధానం చెప్పకుండా విధిని తిట్టుకుంటూ భగవద్గీత పఠనంతోనే కళ్ళనీళ్లు కురిపిస్తూ వుండేది వీధిలోకి వెళ్ళిన తండ్రి జగన్నాధం అప్పుడే తిరిగి యింట్లోకి వచ్చాడు తులిసెమ్మవద్ద బొటబొటా కళ్ళంట నీరు కారుస్తూన్న కూతురు వెంకమ్మగారు కన పడింది.

"ఏం! వెంకమ్మా? అల్లాగ ఏడుస్తున్నావు," - అని ఆప్యాయంగా ఆతురతతో అడిగాడు తండ్రి.

"తండ్రి మనస్సు నొప్పించడం యిష్టంలేక పొర్లుకొస్తూన్న దుఃఖాన్ని లోలోపలే అణుచుకుని" అబ్బే ఏంలేదు!" అంది వెంకమ్మ! ఏం మాట్లాడకుండా యింట్లోకి వెళ్ళిపోయాడు తండ్రి."

మామగారికి అన్నం వడ్డిస్తూ కోడలు- "ఏమోనండి! ఎంతమంది నైనా చూశాం కాని ఏంపిల్లలో, ఏంలోకమో? వేడన్నం పెట్టినా పొడ న్నమని మీ కూతురు ఎదురు పట్టించి తిడుతూంది." అంటూ అత్తగారు చెప్పిన చిలుక పలుకులు మామగారిదగ్గర వల్లేసింది కోడలు స్వరాజ్యం!

అప్పుడే యాజ్ఞీకానికివెళ్ళి ఎండలో తిరిగి తిరిగి వొచ్చాడేమో యీ మాటలు చెవిని పడేటప్పటికి కడుపులో చేయిపెట్టి దేవినట్లయింది! వెనుక, ముందులు ఆలోచించకుండా కూతురు వెంకమ్మను పిలిచి "కొంపలో ఈ వింతకూడా ఏమిటి?"- అని విసుక్కున్నాడు. వెంటనే తన తొందరపాటుకు తనుతనే తిట్టుకున్నాడు! "దెబ్బయితే కలకాలం వుండదుగాని, మాటయితే కలకాలం వుంటుందని" నోరు జారాక ఏమను కుంటేమాత్రం ఏంలాభం,

వెంకమ్మ తండ్రి మాటలకు చాలా ఆశ్చర్యపడింది- "ఒకరినని ఏంలాభం మనఖర్మ యిల్లాగ వుండగా'- అనుకుని ఆదరిస్తాడనుకున్న తండ్రే విసుక్కున్నప్పుడు యిక యిక్కడ - పంచాగ్ని మధ్యంలో వుండడం శ్రేయస్కరం కాదనితలచి ఆరాత్రే అక్కడనుంచి వెళ్ళిపో యింది. పసికందులను చంక నెట్టుకుని పుట్టింటినుంచి వెంకమ్మ!

ప్రక్కనే వున్న గ్రామంలో సంపన్నగృహస్తులు కదా అని కూతురునిస్తే వెధవరికం అనుభవించవలసి వచ్చింది.

అసలు వెంకమ్మగారి అదృష్టమంతా కూతురు పెళ్ళితోనే తుడిచి పెట్టుకుని పోయింది!

పెళ్లిపీటలమీదకూర్చున్నది మొదలు పదహారురోజుల పండగ వెళ్ళే వరకు యిటు ఆడపెళ్ళివారూ, అటు మగపెళ్ళివారూ- యావన్మందీ రాత్రి పగలూఇక్కడేభోజనాలు. పెళ్ళిఅయిదురోజులూ మేళాలు, తాళాలు, భోగం మేళాలు, సంతర్పణలు, దానధర్మాలు, ఘనాపాటిసంభావనలు-మందుగుండు సామానుతో ఊరేగింపులు-ఒకటేమిటి? రామయ్యగారి పదిహేను ఎక రాల పల్లంలోనూ పదిఎకరాలు స్వాహా అవడానికి యిదే కారణం:

పట్టుమని ఒక సంవత్సరం కాపురం చేసిందో లేదో వెంకమ్మగారి కూతురు, భర్త చనిపోవడం,—దాంతో అసలే భర్తపోయి దుఃఖంలో వున్న వెంకమ్మగారికి నడుము విరిగినంత పని అయింది.

ఎవరిననుకుని ఏంలాభం? ఖర్మకు దాసులం కావలసిందే అని గదూ మన సిద్ధాంత గ్రంథాలు ప్రబోధిస్తున్నాయి.

ఎంతకాలమని అటు పుట్టింటి దెప్పి పొడుపులతోటి, యిటు అత్తింటి అధికారాలతోటి సతమత మవుతుంది?

మంచిరోజులు వుండకపోతాయా? అనే మనోధైర్యంతో రోజులు నెట్టుకు వస్తూంది.

వెంకమ్మగారి మరిది సుబ్బన్న ఎప్పటిమాదిరిగానే తోట వ్యవహారాలు చూస్తూ వెంకమ్మగారికి నోట్లో నాలుకలాగ వుంటున్నాడు. యిల్లాగ వుండగా ఒకనాడు, పెరటిలో నూతిదగ్గర నీళ్ళు తోడుకుంటూన్న ఆడవాళ్ళ మధ్యన మడి, ప్రాచి అనే మాటమీద మాటలు ముదిరి - చివరకు తిట్టుకోవడం వరకూ వచ్చింది. యింతకీ వడ్లగింజలోది బియ్యపుగింజ అన్నట్లు వెంకమ్మగారి కూతురు నీళ్ళు తోడుకుంటూంది మరోప్రక్క నుంచి సుబ్బయ్య భార్య నీళ్ళు తోడుకుంటూంది. అందులోనూ నుయ్యి చాలా యిరుకుది కూడాను.

అసలు కోపం యింతకీ తనభర్త సుబ్బన్న వెళ్ళి బావగారి యింట్లో వ్యవహారాలు చక్కబెట్టడం యిష్టంలేక సుబ్బన్న భార్య రేపిన ఘర్షణే యిది.

ఇంతదాకా రెండు కుటుంబాలూ చాలా అన్యోన్యంగా వుంటున్నాయి.

ఆటకోసమని వీధిలోకి వెళ్ళిన రాఘవుడు అప్పుడే యింట్లోకి వచ్చాడు. అక్క ఎందుకో ఏడుస్తూంది ప్రక్కనే అమ్మకూడా ఆలోచనలో నిమగ్నమయి వుంది. ఈ దృశ్యం చూసేటప్పటికి ఏదో జరిగుం

టుందని అనుమానించి అక్కయ్యని వెంటనే అసలు విషయం ఏమిటి అని అడిగాడు. నూతిదగ్గర జరిగిన విషయం యావత్తూ చెప్పింది. తన అక్కని పిన్ని అన్నమాటలకు సహించలేక పోయాడు రాఘవులు!

అసలు విషయం - ఈ నుయ్యి పూర్తిహక్కు వెంకమ్మగారిదే. ఏదో అన్నదమ్ములవడంచేత అందరూ వాడుకుంటున్నారు. అందులోను తన వ్యవహారాలు చూస్తూన్న సుబ్బన్న నూతిలో నీళ్లతోడుకుంటూంటె వెంకమ్మగారు ఎందుకు వద్దంటుంది?-

ఈ నుయ్యి తనకు సంబంధం లేదని, బావగారి హద్దులోనే వుందనికాని-తనను గౌరవం కొలది నీళ్ళు తోడుకోనిస్తున్నారనికాని, తలచి వుండలేదు సుబ్బన్న భార్య.

రాఘవులు వయస్సు వచ్చిన కుఱ్ఱవాడు. ప్రపంచజ్ఞానం సంపాదించినవాడు. అటువంటి వ్యక్తి తన అక్కపడ్డ మాటలకు సహించలేక పోయాడు - వెంటనే నూతిహద్దును, అధికారాన్ని నిరూపించడంకోసం పెరటిలో నూతివద్దకు వెళ్ళాడు రాఘవులు. తను వెళ్ళేటప్పటికి తన తాతలనాటినుంచి పొలాలమీద తిరుగుతూన్న వెంకడు నూతికి అడ్డంగా కొబ్బరి తడకలు అడ్డు కడుతున్నాడు.

ఎప్పుడయితే వెంకడు నూతికి అడ్డుగా తడకలు కడుతూ కంట బడ్డాడో రాఘవులుకు అరికాలిమంట తలకెక్కింది.

ఏరా! వెంకా? నూతికి అడ్డుగా తడకలు కట్టమంది ఎవరురా? అని గట్టిగా అడిగాడు.

అసలు దీనికంతకీ సుబ్బన్న హుకుంజారీ వుంటుందనీ. అందుకే వెంకడు ఈపని చేస్తున్నాడని తెలియకకాదు రాఘవులు అడిగింది. యికముందు తను తన వ్యవహారాలకు బాధ్యత వహిస్తున్నానని నిరూపించడం కోసమే ఈ ప్రశ్న నాందీవాచకంగా ప్రయోగించాడు.

ఏరా! వెంకా? ఆ నుయ్యి, మాదో, బాబయ్యగారిదో ఏనాడైనా విన్నావురా? తిరిగి రెండవసారి రాఘవులు అడిగాడు.

"ఈనాటోడా్న బాబు! మీతాతగారి నాటినుంచి యీ గడ్డమీదేకందా నలుగురు పిల్లల్ని కంట- మహానుబావుడు మీబాబు రామన్నగారు కనక సరిపోయింది. లేకపోతే ఏనాడో యిసమించేది"- అన్నాడు వెంకడు.

సరే! అయితే ఆ తడకలు అక్కడ పడేసి నూతికి అడ్డుగాకట్టడం మానేసెయ్యి-తెలిసిందా? అని గట్టిగా ఆర్డరుచేశాడు రాఘవులు వెంకడ్ని.

వెంకడు ఎవరు?

తనొక కూలీ! వెంకమ్మగారి పొలాలమీద వెంకమ్మగారి మరది సుబ్బన్న అజమాయిషీ క్రింద పనిచేస్తున్నాడు.

నుయ్యి రాఘవులుగారిదే!....అయితే మాత్రం....కూలి యిచ్చేది. పురమాయించేది ఎవరు? సుబ్బన్నగారే! అటువంటప్పుడు ఎంతన్నా ఆయనకు ఎదురు చెప్పగలడా వెంకడు? - అందులోనూ "వాదిగుండు అనే యీ పాత సంఘమర్యాద ముందర?"—

అందుకే తెగించి ఒక్కమాట అనగలిగాడు - "అదెట్లా సాగుతుంది బాబయ్యా" - అని.

తనగడ్డమీద తన నూకలుతిని బ్రతుకుతూన్న వెంకడు యింత మాట అంటాడని తలచనైనాలేదు రాఘవులు - ఈ వ్యతిరేక సమాధానం వినేటప్పటికి రాఘవులుకు ఎక్కడలేని కోపమూ వచ్చింది. వెంటనే తిరిగి తన యింట్లోకెళ్ళి వెళ్ళిపోయాడు.

అప్పుడే పినతండ్రి సుబ్బన్న పొలాలు చూచుకుని వచ్చి వెంకమ్మకారితో మాట్లాడి వెడుతున్నాడు. రాఘవులు సుబ్బన్నను కేకేసి- "ఏదో చిన్నవాళ్లగా వున్నప్పుడు భూములు వ్యవహారాలు చూసిపెట్టావు యిప్పుడు నేను చదువు పూర్తిచేసుకుని ఖాళీగా వున్నాను. యిక మా వ్యవహారాలు నేను చూసుకుంటాను" - అన్నాడు. నిర్మొహమాటంగా రాఘవులు.

పోవోయ్! కుర్రకుంకవు అంటూ చనువుగా కసిరాడు పినతండ్రి సుబ్బన్న;

ఆ మాటలకు రెచ్చిపోయి. సరే! అదీ చూస్తాను అన్నాడు రాఘవులు మరీ కోపంగా!

తనఅక్క తిట్లు తిన్నప్పటినుంచీ రాఘవులు మండిపోతూనే వున్నాడు- పినతండ్రితో వ్యవహారాలు తనేచూసుకుంటానని ఖచ్చితంగా చెప్పాడు.

నిజంగా సుబ్బన్నని వదిన వెంకమ్మగారు ఎంతో నమ్మింది; గౌరవించింది. అతనిచ్చే ప్రతీ సలహాను వేదాక్షరంగా పాటించింది- అందులోనూ ఒకరిని మాట అని ఎరుగని పెద్దగుండె- అటువంటి వెంకమ్మగారు ఈనాడు తన కన్నకొడుకు రాఘవులు మాటలను, చేష్టలనుచూసి ఏమనాలో అర్థంకాక వెలుగునీడల మధ్యలో చిక్కుకుంది.

కొడుకు రాఘవులిని పిలిచి "ఎందుకురా నాయనా అనవసర గొడవలు"- అని సలహాకూడా యిచ్చింది.

ఏదో! అమ్మ మనస్సే అంత! యీసారి మన వ్యవహారాలనుంచి దూరంగా నెట్టేసెయ్యాలి అని పెరటిలోకి తిరిగి ఎందుకో వెళ్ళాడు రాఘవులు! నూతివద్ద సుబ్బన్న భార్యదగ్గర వుండి కూలీచేత నూతికి తడకలు కట్టిస్తూంది. చూశాడు రాఘవులు. "యింత పొగరా" అనుకున్నాడు సహించలేకపోయాడు! వెంటనే ఉద్రేకంకొలదీ నానామాటలు అని వెళ్ళిపోయాడు రాఘవులు.

"స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః" - అని స్త్రీ ఏం చెయ్యతలుచుకుంటే చెయ్యలేదు కనుక? భర్త సుబ్బన్నతో ఏం పితూరీ చేసిందో ఏమో? అంతవరకూ చాలా గౌరవంగా, అభిమానంగా వున్న సుబ్బన్న మండిపడుతూ వెంకమ్మగారింటికి వచ్చి నానా మాటలు అని మీ వ్యవహారాలు యికనుంచి మీరు చక్కబెట్టుకోండి - ఆడదాన్ని చేయి చేసుకుంటాడా?- అని కోపంతో వెళ్ళిపోయాడు.

అంతవరకూ అన్యోన్యంగా నడిచిన సంసారం వెలవెలా అనైక్యతతో వుండిపోయింది.

రాఘవులు యువకోద్రేకంతో బాబాయినీ, పిన్నినీ నానా మాటలూ అన్నాడు. కాని యిప్పుడు తెలుస్తూంది—భారం వహించాక కష్టం విలువ!

"అయ్యో! అనవసరంగా తొందర పడ్డామే? భూమి దున్నడం అంటే మాటలా? అని రాఘవులు తనలో తాను పశ్చాత్తాప పడ్డాడు!

రెండు వసంతాలు తీరకముందే నూతికి సరిహద్దుగా కట్టిన అడ్డు తడకలు ఎండి, చివికి రెండు కుటుంబాల అనైక్యతికూ అయిష్టతగా కూలిపోయాయి!!!

మళ్ళీ మామూలే - పిన్ని నీళ్లు తోడుతూంది! వెంకడు దొడ్లో పని చేస్తున్నాడు!!

వెంకమ్మగారు అజమాయిషీ చేస్తూంది!!!

---



# పరుగులూ! - ఉరుకులూ!!

"నేను వచ్చేటప్పటికి పనులు ముగించుకుని సిద్ధంగా వుండమని చెప్పానా? లేదా?

ఒంటరిగా వెడితే-రాధ ప్రక్కనవుంటే అగౌరవం కాబోసును.... తీసుకు వెళ్ళలేదని సాధింపు- పోనీ- పుత్ర, పౌత్ర భార్యాసమేతశ్య- అందరినీ వెంటబెట్టుకుని ఊడ్పుల జంటలా వెడదామని- తెగించి గుండెలు గమ్మకుంటూ వస్తే ఇంతవరకూ ముఖంకి సోపు పులమడమే అవలేదు.

ఇక అద్దంముందు కూర్చుని సింగారింపులు- బూడిద పూతలు- మొదలయిన మేకప్‌తోనే సరిపోతూంది!

ఎప్పుడు బయలుదేరేది? ఎప్పుడుచచ్చేది?...."- అప్పుడే ఆఫీసు నుంచి సినీమాకోసమని పరుగెత్తుకు వచ్చిన రావు, భార్య రాధని అన్న మాటలు!

కాని యివి మాటలని నా వుద్దేశ్యం పుట్టుకే! వీటికే తిట్లు- అని రాధ; అదిరింపు- అని రావు అర్థం చెప్పుకోవడం పరిపాటి!

తెల్లదానిమ్మలాగ పళ్ళు పైకెట్టి చిరునవ్వులు చిందిస్తూ- "అసలు ఈ మొగాళ్ళకు ఇలా మాటలు అంటేనే కాని భర్తనన్న సంతృప్తి కలగదేమో" - అంది రాధ!

"ఏ'శావులే! గమ్మని తెమిలివావు! యిప్పటికే పెద్దగా టయిము అయింది...." అని ఓ విసురు విసిరి గదిలోకి బయలుదేరాడు రావు!

వెధవది- అన్నీ సమస్యలే! యీ మగజన్మే యింత ఒడిదుడుకు లది! లేకపోతే ఏమిటీ-డబ్బులు వున్నా లేకపోయినా- ఎకౌంట్సు సరి పెట్టుకునే పనినుంచీ - తక్కువయితే ముష్ఠితీసి దిష్టితియ్యడందాకా డ్యూటీ ఈ మగాడికేనా?

ఏదైనా అంటే పిల్లలకు పాలూ. అవీ యివ్వడం మీరు చేస్తున్నారా? అని అడగడం ఓ మాట నేర్చారు!

పోనీ అవి అయినా యిచ్చి చస్తున్నారా అంటే నెలకు పాల డబ్బాల ఎకౌంటుకు ఏం లోటులేదు!

ఇంతకీ ఎంత చచ్చిందో? పర్సులో....

తిన్నగా డ్రాయరు తెరిచి _ పర్సుని అందుకుని - రెండు వేళ్లూ అందులోకి పోనిచ్చి - చూసీ చూడకుండా - ఒక పది అందుకుని - "ఏం - తెమిలిందా ఏమిటి?" - అంటూ వీధిలో అడుగెట్టాడు రావు.

తను ఒక్కడూ అయితే పరిగెత్తి- బస్సు ఎక్కగలడు- రాధో మరి? ఒకవేళ పరుగెత్తి ఎక్కబోయినా- ఎక్కుతుందన్న నమ్మకం రావుకు లేదు- అందుకే రెడీగా వుందనుకున్న బస్సు "గుడ్‌బై" చెప్పి దూరమైపోతూంటే- గుస్సు అప్పగించి_ రాధను క్రిందనుంచి పైకి పరికించాడు, "నీతో ప్రయాణం ఏనాడూ యింతే అన్నట్లు!"

రాధ కనుక రావుకి సరిపోతూంది! ఏరాక్షసిలాంటి భార్య అయినా కనుక్క అయివుంటే తెలిసొచ్చేది?

పంపులో నీళ్లు ఆగిపోతే బాధ్యురాలు రాధ. వీధిలోకి మంచికూర అమ్మ రాకపోతే తప్పు రాధది- అదీయిదీ ఏమిటి- గడ్డంగీసే మంగలి కనిపించకపోతే 'దరిద్రురాలు_' అంటూ రాధకే అక్షంతలు!

తిరిగి ఏమని అడిగితే- భర్తని ఎదిరించిందంటారు! గట్టిగా మాట్లాడితే ఆడది! ఆడది!! ఆడది!!!

ఒదుగుండు- సంఘం గీసినగీట్లు-

ఈత తెలిసినవాడికి లోతుతో సంబంధం లేనట్లు-రావు విసువుదల మనిషని బాగా తెలిసిన రాధకు- ఈమాటలు_ విసుక్కోవడాలూ- అంత ఆలోచించవలసిన పనికాదు- అసలు ఆలోచించనే లేదు!

తిన్నగా ఎలాగైతే - థియేటరువద్దకు చేరుకున్నారు।

టిక్కట్లు అమ్మే కిటికిటీ ఒక పది గజాల దూరంలోనన్నా వుండి వుంటుంది। గబగబా వెళ్లాడు - తారా జువ్వలాగే వెళ్ళాడు - ఇంతలో వెనుకనుంచి "ప్లీజ్-క్యూ" అని పది కంఠాలు ఒక్కసారిగా మ్రోగాయి మిల్టరీ డ్రిల్లులాగ - హాల్టు। అన్నట్లు ముందుకు అడుగెయ్యకుండా ఆగి పోయాడు రావు।

రాధ ముఖంముందర - యింతమంది మధ్యలో - ముందుకు జొచ్చుకు వెళ్ళలేనందుకు కొంచెం నిరుత్సాహం వర్షంనాటి గాలిలాగ మనస్సులో వీచకపోలేదు।

అయినా ! కర్తవ్యా నెదుర్కోవలసిందేకదూ।

రాధను పంపాడు 'లేడీస్‌వే' - అన్నదారంట।

అక్కడా మొగవారికి దొరకలేదు టిక్కట్టు - ఆలోచించాడు। వెళ్ళిపోదామనుకున్నాడు। క్యూలో నిలుచున్న వీరులు తనను చూసి హేళన చేస్తున్నట్లుగా ఫీలయాడు।

గోడమీద సినిమా వాల్‌పోస్టర్ 'ఇంతావచ్చి యింటికేనా?- అన్నట్లు తలుచుకొని - మరీ పట్టుదలతో 'క్యూలో' తానూ జాయిన్ అయాడు।

తనకంటే ముందు 217 మంది వున్నారు. వారందరూ పని విజయవంతం చేసుకుంటే కాని తనకే తెలియదు।

ఒకసారి రాధకేసి. ఒకసారి 'క్యూ' కేసి- ఒకసారి బుకింగ్ కిటికీకేసి ఆత్రుతగాచూస్తూ- ఒక్కొక్కసారి పదిరూపాయల నోటుని- తడుముకుంటూ- అలా నుంచున్నాడు।

"ఏమిటో। రావుకు అంతా పిరికే। మా రాజమండ్రిలో అయితేనా అలా 'క్యూ' దారి 'క్యూ'ది। మనుష్యులదారి మనుష్యులదీ। కిటికీవద్దకే

మనుష్యుల భుజాలమీద నుంచి పాకివెళ్ళి- చొక్కాలు చిరిగినా-రక్తాలు కారినా- టిక్కట్ తెచ్చి- విజయం సాధిస్తారు! మరి రావు? ఏమిటో! న్యాయం! నాగరికత! అంటూ అలా నుంచుంటే- ఎప్పటికి ఈ జనం తరగను! ఏనాటికి మనం ఫిలిం చూడగలం'- అనుకుంటూ- రావుని, కిటికీని పరికిస్తూ ఒకసారి ఎడమకాలిని వంచి- ఒకసారి కుడికాలినివంచి అపసోపానాలు అనుభవిస్తూంది రాధ!

'క్యూ' ముందుకు రోకలిబండలాగ నడక సాగిస్తూంది! అలా రోకలిబండలో ఒక కాలులాగ, కొంచెం కొంచెం, ముందుకు కదులుతున్నాడు రావు-

"ఎంత మందికి టిక్కట్లు అమ్మడం? అసలు ఈ హాలులో - ఈ టిక్కెట్టు కెపాసిటీ ఎంత అయివుంటుంది!

ఒక్క అరగంట అవచ్చిందే-యిక్కడ నుంచుని! ఇంతలో ఎన్ని టిక్కట్లు అమ్మి వుంటాడు? నీరసంగా వుంది కాఫీత్రాగినా బాగుండును! అనుకున్నాడు రావు తనలోతాను!

ప్రక్కగా అటు యిటూ వున్న "క్యూఫ్రెండ్స్"తో - యిప్పుడే కొంచెం కాఫీ తీసుకువస్తా....అని చెప్పి తన స్టాండింగ్ ప్లేస్‌ని గుర్తు పెట్టుకుని - దూరనవున్న రాధతో - సంజ్ఞగా తను వెడుతూన్న పనిని సూచించి వెళ్లాడు.

కాఫీ త్రాగుతున్నాడన్న మాటేకాని - "టిక్కెట్లు అమ్మకం ఎంత దాకా వచ్చిందో! రాధ ఒక్కర్తె వుంది? తను నుంచున్న కాళీలో ఎవరైనా ఉద్దండులు వద్దంటున్నా దూరి వుండరుకదా?"

ఈ ఆలోచనలమధ్య కాఫీ కషాయాన్ని మింగి తిన్నగా 'క్యూ'ను చేరుకున్నాడు.

తను నుంచోవలసిన స్థలంలో ప్రవేశించేవాడు! ముందు జనం మాట్లాడలేదు కాని - తనకంటే వెనుక నుంచున్న తనకంటే - దురదృ

ష్టంకు నోచుకున్న అదృష్టహీనులు - ఏహ్! 'క్యూ' అంటూ ఘొల్లు మన్నారు! ఆ సమయంలో అనుభవించగల్గిన ఆ సమయం లేడి అనుభవించే ఆ మానవునికే తెలియాలి!

ఈలోపల - తను సాక్షిగా వేసుకున్న తన సీటుకు రైట్, లెఫ్ట పురుషులిద్దరూ - యితనిదేనని సెకండ్ చేసి రావుకు ఆచోటు చూపారు అమ్మయ్య? అనుకున్నాడు!

అనుకోవడమేమిటి - అంతకన్నా తనుకాని - తనలాంటి-అదే పరిస్థితిలో చిక్కుకున్న యితరులుకాని - చేయగలిగిందీ - నోచుకోగలిగిందీ ఇందుకు భిన్నంగా వుండదు - వుండకూడదు!

రాధ - రావుకేసి నిలుచున్నచోటునుంచి ఆతృతగా చూస్తూంది! "క్యూ" కదులుతూంది!! రావు అందులోనే కదిలి ముందుకు వెడుతున్నాడు!

అబ్బ! ఒక నిట్టూర్పు విడిచాడు రావు! ఆ నిట్టూర్పులో ఎంత బలమయిన సంతృప్తి - ఇక టిక్కట్టు అందుకునే సమయం - ఒక్క క్షణంలో-అందులో మరీ సగం సమయంలో - వచ్చాశాముకదా అని!

తను మూడవవాడు! కాదు- అతను టిక్కట్టు అందుకుని జెర్రిలా లోనికి జారిపోయాడు!

ఇక ఖచ్చితంగా తను రెండవవాడు! అబ్బే! అనుకున్నంతలోనే అతను ఖంగున కాసు అందించి- ఖరార్ఖుగా టిక్కట్టు అందుకునిలోనికి వెళ్ళిపోయాడు!

ఇక రావుదే చాన్సు! దూరానవున్న రాధ తనుభర్త టిక్కట్టు అందుకోబోతూన్నందుకు- అబ్బ! యిప్పటికయినా వంతు వచ్చిందిరా - భగవంతుడా! అనుకుంటూ- రావును తదేకదీక్షగా చూస్తూంది!

రావు పదిరూపాయలు ఠీవిగా తీసాడు! తనకంటే వెనుకవున్న వాళ్ళను ఒకసారి దర్జాగా పరికించాడు!-

కిటికీలో చేయి పెట్టబోతూ- "టూ టిక్కెట్స్" అన్నాడు।

లోపల బెల్ మ్రోగింది। "హౌస్‌ఫుల్"- బోర్డు కళ్ళముందర అలంకరించబడింది।

కిటికీ తలుపులు మూసుకున్నాయి। రావు చేతులు బరువుగా- టిక్కెట్టు అంటకుండానే తిరిగి బయటకు జారాయి।

రావు ఏమంటాడో అని బెదురుచూపులు చూస్తూన్నుంచుంది రాధ।

రాధను చూస్తూ "హుం- నడు-" అన్నాడు రావు।

సినీమా ప్రారంభం అయింది। ఏంలాభం। దొరకలేదు టిక్కెట్టు। అందలేదు బస్సు। అనుగ్రహించలేదు అదృష్టం।।।



# సమస్య తీర్చిన సంక్రాంతి

ఏమిటి మామయ్యా, ఎప్పుడుచూచినా ఏదో ఆలోచిస్తూనే వుంటావు?—

అవునుతల్లీ - ఈ జీవితాలు అన్నీ యిలా ఆలోచనలమధ్యనే మలికి రాలిపోయిన మావిడాకులా కూలిపోవలసిందే - ఉదయం లేచింది మొదలుకొని - తిరిగి పండుకొనేవరకూ అన్నీ సమస్యలే యీ జీవితానికి—

గారాబంగా - చనువుగా దగ్గరసావచ్చి అడిగిన మేనకోడలు సుగుసుజాతకు వేదాంతిలా సమాధానం యిచ్చాడు రైతు రామయ్య.

రైతురామయ్య ఏం చిన్నవాడుకాదు - యిద్దరు మొగపిల్లలూ, నలుగురు ఆడపిల్లలూ కలిగిన మధ్యతరగతి సంసారి.

కొడుకులిద్దరూ చదువుకుంటున్నారు. ముగ్గురు అమ్మాయిలకు వివాహాలు చేశాడు.

ఆ వివాహాలతోనే రైతురామయ్య నడుం విరిగిపోయింది.

మిగిలిన సగం చదువులకోసం, పొలం పెట్టుబళ్ళకోసం ధార పోస్తున్నాడు.

ఏం సంసారాలో. గోచీకి పెద్దవీ, ఖండువాకి చిన్నవీ. తను యింతతిని నలుగురికి యింత పెట్టుకుందామంటే సాగని రైతాంగం.

వెధవ చట్రంలో అమర్చారు రైతాంగ శాసనాలని.

కాకపోతే ఏమిది చెప్పు. కాలం కనికరించక ప్రకృతి కోపగించి పంటలను నాశనంచేసినా పన్నులు కట్టాలికదా?

"మామయ్యా"! - గడపలోంచి సుజాత పిలుపువిని ఆలోచనల నుంచి విడివడి ఎవరా అని చూడసాగాడు రామయ్య.

అంతదాకా ఆలోచనలతో కృంగిపోయిన రామయ్యకు కొండ విరిగి మీద కూలినట్లుగా అయింది. ముఖంలోనే ఎందుకో మార్పు మినుకుమినుకుమంటూ దిఙ్మాత్రంగా సూచిస్తూంది.

ఈ వాలకం సుజాత పసి హృదయానికి ఏం అర్థం కాలేదు. అయినా ఆ జీవితలోతుల్తో తనకు అంత నిమిత్తం లేదుకూడా.

"రండి, రండి"- వచ్చిన వ్యక్తిని అహ్వానించాడు, రామయ్య. ఆ అహ్వానంలో ఏదో ఆతృత గోచరిస్తూంది.

ఆ వ్యక్తి లోనికివచ్చి తాటాకులతో అల్లిన చాపమీద ఆసీనుడయాడు. ఆ వ్యక్తిలో ఏదో కర్తవ్యం కరకరలాడుతూంది.

ఒక నిముషం ఆ వచ్చిన వ్యక్తిగాని, రామయ్యగాని నోరు మెదపలేదు.

నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎదుటివ్యక్తే- "దీపావళి వెళ్లిందికదూ అందుకు వచ్చాను"- నీమాటను చెల్లించుకోవలసిన ధర్మం....

"అవును, అది నా ధర్మం"- ఎదుటివ్యక్తిమాటలకు అడ్డుగా ఒక మాట అని వూరుకున్నాడు రామయ్య.

ఈ మాటకు ఎదుటివ్యక్తి కొంచం కంఠాన్ని శృతిహెచ్చించి- "ధర్మాలు పలకడం చాలా సులువు- నిలబెట్టుకోవడంలోనే వుందిబాధ"- ధర్మప్రబోధకుడిలా మాట్లాడాడు.

"శెట్టిగారూ, పిల్లలు కలవాడిని- అదీకాకుండా మూడో అమ్మాయికి సరిగా సంవత్సరంకాలేదు పెళ్ళిఅయి- ప్రకృతి రైతులమీద శీత

కన్ను వేసింది. అవసరానికి ఆదుకున్నారు. కళ్ళంలోనే పంటను మీకు అప్పుగా కొల్చేస్తాను. ఈ మాటుకు కనికరించి దయచూపాలి"- ప్రాధేయుడై అడుక్కున్నాడు రైతురామయ్య.

ఈ మాటలు వింది రామయ్య భార్య. అయినా తెలుగు స్త్రీకివున్న కొన్ని కట్టుబాట్లు తనను యీ విషయంలో నోరు మెదపనియ్యలేదు.

"అయితే యింతకీ....?"

"..............."

సమాధానం ఏం యివ్వలేదు రామయ్య.

రైతు రామయ్య చాలా గౌరవమయినవాడే, నమ్మకస్థుడే. మాటకు కట్టుబడివుండేవాడే. లేకపోతే యింత సంసారాన్ని ఎలా యీదుకువస్తున్నాడు_ మాటలా ఆడపిల్లల పెళ్ళిళ్ల చేయడమంటే? ఒకటా రెండా. మూడుపెళ్ళిళ్లు ఒక్కరెక్కమీద చేశాడు- యింతదాకా ఏనాడూ మాటపడి ఎరుగడు- మాటపడడం దాకా ఎందుకు- గ్రామంలో తనూ ఒక రైతుపెద్ద.

ఇంట్లో ఆవు యీనిందంటే జున్ను నలుగురూ రుచి చూడవలసిందే. గ్రామంలో పసిపిల్లలకు ఆవుపాలు రామయ్య గడపలోనే దొరికేవి. కూర నారా అడిగితే రామయ్య భార్య లేదని ఎరుగదు.

అటువంటి హుందాతనంతో బ్రతికిన రైతు రామయ్య- యీనాడు అనుకోకుండా ఒడుదుడుకులకు లోనయాడు. ప్రకృతే రైతులోకంమీద కత్తికట్టిందా అన్నట్లు అన్నివిధాలా పంటలు దెబ్బతిన్నాయి.

దీనికితోడు అమ్మాయిపెళ్ళికి చాలా ఖర్చుచేశాడు.

రానున్న పంటనుచూపి సొమ్ము ముందరే తెచ్చుకొన్నాడు.

కాని పంటలు దక్కలేదు. కొబ్బరి పుచ్చెలోనే రాలిపోయింది.

ప్రభుత్వానికి ఎన్నో అర్జీలు పెట్టుకున్నాడు. కర్ణం. మునసబుల దృష్టికి తీసుకొచ్చాడు. మంత్రిగారు ఆ గడ్డమీదనుంచి ఎన్నోసార్లు వెడుతూ చూశారు.

రెవిన్యూవాళ్ళు యీ సమయంలో అసలు కనిపించరు- యివన్నీ గోరుచుట్టుమీద రోకటిపోటులాగ వచ్చిపడ్డాయి- ఎన్నింటికని భస్తాడు- అయినా తెలుగు గుండె కనుక- ధైర్యంగా నిలువకలిగాడు రైతు రామయ్య।

ఇంతకీ ఆత్మగౌరవం కలవాడుకనుక- శెట్టిని ఏం అనలేక మౌనంగా వుండిపోయాడు.

"అయితే- దీపావళికి యిస్తానన్న కొద్దిసొమ్ము అయినా యివ్వ డానికి సిద్ధంకాలేదన్నమాట"_ నిష్ఠూరంగా నిలతీశాడు శెట్టి:

"శెట్టిగారూ_మీబోటి యింటింటికీ దీపావళేకాదు - అది దివ్య దీపావళి - కాని మాలాటి బక్కచిక్కి, బ్రతుకే భారమయిన మధ్య రైతులకు దీపావళి కాదు శోకావళియిది.

ఒక్కమాట - అటు సూర్యుడు యిటు ఉదయించినా, సంక్రాం తికి గింజలు కొల్చి మీబాకీ తీరుస్తాను.

పంటలక్ష్మిని నమ్ముకొన్న రైతులోకం మాది - మాకు ఉన్నదీ కన్నది సంక్రాంతే. - ఆనాడు మా రైతుకు ఏం లోటు వుండదు"—

గంభీరంగా వాగ్దానం చేసి శెట్టిముఖాన్ని ప్రశ్నార్థకంగా చూడ సాగాడు రైతురామయ్య.

"మీదికాదయ్యా యీ తప్పు. నేటి నేషనల్ గవర్నమెంటోరి దనుకో యీ తప్పు.

మునుపుయిలా సమాధానం యిచ్చాడా ఒక్కరైతు.

భూస్వామ్య సంస్కరణలనీ, కౌలుదారీ బిల్లులని, ఋణవిమోచన చట్టాలనీ పెట్టి - మీకు పాఠాలు నేర్పింది.

"దున్నేవాడిదే భూమిట! నయం. రేపు నివసించేవాడిదే మేడ అని ఒక శాసనం తెస్తారు"- తనకున్న ప్రభుత్వద్వేషాన్ని విషం కక్కినట్లు కక్కి వెళ్ళిపోయాడు శెట్టి

వెళ్ళిపోతూన్న శెట్టికేసి - కనికరించి వదిలి ప్రాణభిక్ష పెట్టిన యమునిలాగా చూస్తూ నిలబడి పోయారు రైతు రామయ్య.

తన కంటిముందు సంకురాత్రి పంటలచ్చి కనిపించి ధైర్యం పలుకుతూన్నట్లు కొంత ధైర్యం తెచ్చుకున్నాడు అంతలోనే.

* * *

క్షేమం 10-11-1957,

"శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ నాన్నగారికి....మీ మూడవ కుమార్తె విష్ణువర్ధని అనేక నమస్కారాలతో వ్రాయునది

నాన్నా, అమ్మ పంపిన అరిసెలమూట- దీపావళికని పంపినవి- అందాయి. తియ్యగా బాగా వున్నాయని అమ్మకు చెప్పు దీపావళి మా గ్రామాన చాలా బాగానే జరిగింది.

కాని మాయింట ఆరోజు- ఏం చెప్పమంటావు- చెప్పడానికి నోరు రావడంలేదు- మీ అల్లుడుగారు మీమీదవున్న కోపాన్ని ఆధారం చేసుకొని- నన్ను బాధలు పెడ్తున్నారు.

ఉగాదికి తనను పిలిచి పండుగ జరుపలేదుట- ఆఖరికి క్రొత్త బట్టలయినా పంపలేదుట. దీపావళికి అయినా అత్తవారింటినుంచి పండుగకు అహ్వానం వస్తుందని ఎదురు చూశారుట- తన ఆఫీసులో అందరూ దీపావళికి అత్తవారి ఋళ్ళకు వెళ్ళగా తను వెళ్ళకపోవడం అగౌరవంగా

బాధపడి- మీనుంచి కబురు రానందున నన్ను దీపావళినాడు- గ్రామంలో కాకర్లుకాంతులు జిమ్ముతూ ప్రతిగడపనా దీపకళికలు మిలమిలా మెరుస్తూంటే- ఆ కాంతుల మధ్య అందరూ ఆనందాన్ని అందుకుంటూంటే- నా నడ్డిన గుద్దులు, నా బుగ్గన గిల్లులు, నానెత్తిన బూతుల ఆశీర్వచనాలూ పడినాయి- యిదీ నా దీపావళి పండుగ.

మొన్న అమ్మ ఒక జాబు వ్రాసింది-అందులో ఆయనకు అన్ని పండుగలకూ ముట్టవలసిన బహూమతుల సొమ్మూ - వచ్చే సంక్రాంతికి యిస్తాము-సంక్రాంతికి అందరూ పద్దురుగాని-అని అంతటి అదృష్టమా యీ విష్ణువర్థనికి అనిపించింది.

అక్కలూ, బావలూ అందరూ కూడా సంక్రాంతికి వస్తారుట కదూ-ఏమో నాన్నా-సంక్రాంతికైనా మీ అల్లుని అలుక తీరుతే-నానడ్డి గుద్దులబారినుంచి, నా మనసు దెప్పిపొడుపులనుంచి తప్పుకొని సుఖపడుతుంది. ఇంకో విషయం....

తండ్రి ఆస్థిలో కొడుకులతోబాటు కూతురుకుకూడా వాటా వస్తుందట. ఇది తప్పక ప్రభుత్వం శాసనంగా తీసుకువస్తుంది—

ఆమాట వినిననాటినుంచీ ఇంక మీ అల్లుని రాద్ధాంతం ఏం చెప్పమంటావు

"ఏయ్, విష్ణువర్ధనీ - ఎప్పుడు తెస్తావు నీవాటా - మీ నాన్నకి వున్నభూమి వివరాలు ముందు సేకరించు - భలే శాసనంలే" - అంటూ వేపుకు తింటున్నారు.

నాకు ఉడుకుమోత్తనం వచ్చింది. లేకపోతే ఏమిటి చెప్పునాన్నా. భూమి మనదికదా- నన్ను పెళ్లాడితేమాత్రం- ఈవేళ వాటాయివ్వాలా- చెప్పు.

యింతలో ఒకమాట జ్ఞాపకానికి వచ్చింది. ఆంధ్రప్రభలో ఒక వార్త ఎప్పుడో చదివింది.

అది ఏమిటంటే...."దున్నేవానిదే భూమి...." అని.

మీ అల్లుడు- నీతండ్రి ఆస్తినుంచి వాటారావాలి- అని నన్ను అనగానే- కోపంవచ్చి, వుడుకుమోత్తనం పట్టలేక- "చూడండి- అప్పర్ డివిజన్ కార్కుగారూ- నీసాకార్కులా కుర్చీని అంటిపెట్టుకొని ఉద్యోగం చేసేవారికి భూమిమీద హక్కువుండదు. దున్నేవానిదే భూమిహక్కు తెలుసునా—" అని అడిగేశాను. దాంతో ఆ మాట ఆయనకు కోపం తెప్పించింది. గుడ్లెర్రజేసి ఆఫీసుకు వెళ్ళిపోయారు.

ఏమిటో నాన్నా, అమ్మ ఉత్తరం చూసినప్పటినుంచీ, సంక్రాంతి ఎప్పుడు వస్తుందా, మీ అల్లుడి అలుక ఎప్పుడు తీరుతుందా, అని ఎదురు చూస్తున్నాను.

అమ్మని, అన్నలని, అందర్నీ అడిగానని చెప్పు-

విష్ణువర్ధని-"

ఉత్తరం చదివి- చిన్నబుచ్చుకున్నట్లుగా చూస్తూ కూలబడ్డాడు రైతు రామయ్య.

చేతిలో కూతురు రాసిన ఉత్తరం గాలికి అటూ యిటూ కొట్టుకుంటూ.... కళ్ళముందు కనిపించే గాలిపటాలకు ఈ జీవితాలు నేస్తం' అన్న సందేశాన్ని అందిస్తూందా అన్నట్లు వుంది.

"వర్ధని రాసిందా కవరు?"— దగ్గరగా జేరి అడిగింది రామయ్య భార్య సూరమ్మ.

రామయ్య చేతిలో కవరు అప్రయత్నంగా నేలమీద పడింది.

తన ప్రశ్నకు సమాధానం యివ్వని భర్తను- లోతుగా పరికిస్తూ నేలమీద కవరు ఒంగుని చేతులతో అందుకొని చదవనారంభించింది.

రామయ్య ఏం మాట్లాడలేదు. అసలు తను మాట్లాడగలిగిన స్థితిలో ప్రస్తుతం లేదేమోకూడా.

వడ్డీకి అప్పుపెట్టిన శెట్టి రావడంతో హృదయం కొంచం గాయ పడింది రామయ్యకు. ఆ వెనుకనే తను మొన్ననే పెళ్లిచేసి ఎంతో సుఖంగా వుంటారనుకొన్న మూడవకూతురు సంసార పరిస్థితి ఈ విధంగా వుంది- ఈ పరిస్థితిలో ఏమానవుడు మాత్రం ఏం మాట్లాడ గలడు- మాట్లాడకలిగింది ఏముంటుంది?

అయితే రైతు రామయ్య చేయవలసిన కర్తవ్యం ఏమిటి?

తెలుగు రైతుబిడ్డగా ధైర్యంతో ముందుకు సాగాలి. దేశానికి వెన్నుముకగా తనను నమ్మకొన్న దేశబాధ్యతల నిర్వర్తనకు మెలకు వతో నిలబడాలి.

నిజం. తన బాధ్యతలు తను ఎరిగి, తనమార్గాన్ని తానై సరిగా గుర్తించి నడకసాగించిననాడు గమ్యం సులువుగా- సునాయాసంగా చేరుకోగలుగుతాడు. ఆలోచిస్తూ కూర్చోవడంలో విజ్ఞతలేదని గుర్తెరిగిన రామయ్య అక్కడినుంచి లేచాడు.

తన భర్త లేచాడన్న విషయాన్ని అయినా గుర్తించకుండా తదేక ధ్యానంతో ఉత్తరం కాగితాలలో కళ్లు పెట్టుకొని చదువుతూంది సూరమ్మ.

సూరమ్మ చాలా అనుభవం గడించిన రైతు స్త్రీ. కాని చదువు కున్నది రెండవక్లాసు మాత్రమే.

ముమ్మూర్తుల - సూరమ్మగారు తెలుగుజాతి ప్రతిబింబము. ఎర్రని కుంకుమబొట్టు, తీర్చి దిద్దిన ఆ చీర, మోచేతులవరకూ జాకెట్టుతోటి అపర లక్ష్మీదేవిలాగా కళకళలాడుతూ - తెలుగు గడపకే కాంతి కలిగి స్తూంటుంది.

అంతటి ఆమె కనుకనే పెద్దసంసారాన్ని చక్కగా దిద్దుకొస్తూంది.

కాలికి చెప్పులజోడు తొడుక్కున్న కిర్రు చప్పుడు చెవిలో పడి తల ఎత్తింది సూరమ్మ.

వెనుదిరిగి చూశాడు రామయ్య.

కళ్ళంపట నీటిబిందువులు చెక్కిళ్ళపై పడి మాతృహృదయపు విలువను గుర్తుకు తెస్తున్నాయి. స్త్రీ కన్నీరు గడపకు చేటని రామయ్యకు తెలుసును. సంసారంలో స్త్రీ నవ్వుతూ వున్నంతవరకే ఆ సంసారం ముందుకు వస్తుంది.

చాలా మనోధైర్యం కలవాడు రైతు రామయ్య. అదేకాదు ఎంతటి కష్టం ఎదురొచ్చినా - గరళాన్ని మ్రింగిన యీశ్వరునిలాగ - బేజారు అవడు. బేజారుగా కనుపించినా అది తాత్కాలికమే. అయినా తనభార్య కంటతడి తనకు కష్టమనిపించింది.

"ఏమిటిది. సంసారనౌక ఏ ఒడుదుడుకులూ లేకుండా సాగితే ప్రపంచంలో అసలు సమస్యలు అనేవి ఎందుకుంటాయి - యిటువంటివి సహజము. ఈ మాత్రానికే నువ్వు కన్నీరెడితే - అక్కడ అభం, శుభం తెలియని విష్ణువర్ధని ఏమవాలి?"

"గవర్నమెంటు ఏదో అప్పులు ముందేయిచ్చి - ధాన్యాన్ని లాభానికి అమ్మి సహాయపడుతుందని తెలిసింది. ఈరోజే యింకో విషయం కూడా విన్నాను ఎరువులూ, విత్తనాలూకూడా గవర్నమెంటే యిస్తుందట - ఎక్కువ పండిస్తే పంటరాలుబడి చూసి - బహుమతులిస్తుందట- యింకా ఆలోచన ఎందుకు - బెంగ ఎందుకు" - భార్యను ఓదార్చాడు రామయ్య.

ఓదార్చడమేకాదు వెంటనే ఎక్కడికో బయలుదేరి వెళ్లిపోయాడు రైతు రామయ్య.

* * *

"ఘల్లూ ఘల్లూన పాద
గజ్జెలందెలూ మ్రోగ
కలహంసా నడకాలా
కలికీ ఎక్కడికే?"—అని

పాడుకుంటూ పందింట్లో పనులు చేసుకుంటూంది సూరమ్మ. అప్పుడే ప్రవేశించింది రామయ్య మేనకోడలు.

"ఈవేళ ఎంతో హుషారుగా వుందిలే నీ ముఖం"....నవ్వుతూనే ప్రశ్నించింది.

నిజంగా సంతోషంగానేవుంది సూరమ్మగారు - కాని తనకు తెలియకుంటా తనలో కలిగిన సంతోషాన్ని తను గుర్తించనేలేదు.

"మావయ్య నడ్డిమీద యినుపబండ బరువు యింతదాకావుంది- అలాగే మోస్తూ వస్తున్నారు- యిక ఆ బరువును మోయక్కరలేకుండానే వుండచ్చుట" - ఏదో భావనలో చెప్పింది సూరమ్మ.

"బ్రతుకు- బరువు" అంటే యింకా అర్థం తెలియని అమాయికురాలు సుజాతకు ఈ సమాధానం అర్ధంకాలేదు - సంతృప్తి నివ్వలేదు కూడాను-

అయినా అంత పట్టించుకోలేదు సుజాత.

అక్కడనుంచి దొడ్లో జాజిమొగ్గలు కోసుకుందుకు వెళ్ళిపోయింది - జాజిమొగ్గలమీద వున్నంత ప్రీతి జీవిత సమస్యలమీద లేదు సుజాత.

వీధితలుపులు అంతదాకా బార్లాతీసే వున్నాయి. ఏదో ఆలోచించుకుంటూ పందింట్లోకి ప్రవేశించిన సూరమ్మ తలుపువేయడం మరచిపోయింది.

గాలికి తలుపులు కొంచం గడబిడ చేస్తున్నాయి- ఆ అలికిడి విని ఏమిటోని సావిట్లోకి వచ్చి చూసింది.

"నా తెలివి చల్లార....యింత మతిమరపు ఏమిటో - ఇంతా చేసి తలుపులు వెయ్యకుండా నే వచ్చాను" - స్వగతం వల్లించుకుని తలుపులు వేయబోయింది సూరమ్మ.

వేసీవేయడంతోటే - బైటనుంచి తలుపు తట్టినధ్వని ఆయింది. "ఎవరు?" ప్రశ్నించింది సూరమ్మ.

"సంక్రాంతి లక్ష్మి" - అవతలి గొంతు పలికింది.

"సంక్రాంతి లక్ష్మి?" - తనకు ఏం అర్ధంకాలేదు- "తను ఆలోచిస్తూన్న సంకురేత్రి విషయాలను గుర్తించి నన్ను యిలా వేళాకోళం చేస్తున్నారేమో ఎవరేనా?" - అనుకుంది.

కంఠం కొంచంలో కొంచం- పాత పరిచయ కంఠంలాగా అనుమానంగా వుంది- అనుకొంటూ- - మరుక్షణంలో- గుట్టును కనిపెట్టిన ధీమాతో- విష్ణువుగారు యింట్లోలేరు- అనేసి నవ్వుతూనే తలుపుతీసింది.

రైతు రామయ్యే- అతను. భార్యను వేళాకోళం చేసి భార్యమూతి ముడిస్తే వున్నంత ఆనందం- ఎక్కడా వుండదు- అనుకుంటాను.

కాళ్లు కడుక్కోడానికి చెంబెడు నీళ్ళు, ఒకతుండు తెచ్చి భర్తకు అందించి.... "ఆయితే- యింతకీ- వెళ్లిన పని అయిందా?"- ఆతృతగా అడిగింది సూరమ్మ.

ఏం పని?- ప్రశ్నార్ధకంగా ముఖంపెట్టి అడిగాడు రామయ్య. చాలా ఆశ్చర్యం కలిగింది సూరమ్మకు. భర్త యిలా అంటాడేమిటా అని. అంతలోనే తమాయించుకొని- "అబ్బే ఏం లేదు"-అని నిండుగా పలికి వూరుకుంది.

"లేకపోవడమేమిటి?"- తిరిగి రెండవ ప్రశ్న రామయ్యది.

నోరు మెదపలేదు యీతూరి సూరమ్మ. కాని హృదయంలో భర్త ఏ విషయం చెప్తాడో అన్న ఆతృత పరవళ్ళు తొక్కుతూనే వుంది.

"వింటున్నావా?" తిరిగి చిలిపిగా ప్రశ్నించాడు రామయ్య.

చిలిపితనానికి తనూ రామయ్యకు ఏం తీసిపోదు సూరమ్మ. "చూస్తున్నాను. వినడంలేదు"- సమాధానం యిచ్చి, వస్తూన్న నవ్వును పెదిమలలోనే బలవంతంగా దాచుకుంది.

ఈ సమాధానం కొంచంలో కొంచం తబ్బిబ్బే కలిగించింది రామయ్యను. ఏమనడానికి వెంటనే ఏం తోచలేదు.

"ఎక్కడేనా మాటలు వింటారుకాని- చూస్తారా ఏమిటి?-"

"నేను మాటలు వినడంలేదే. మీ ముఖంకేసి చూస్తున్నానన్నాను" - హుందాగా సమాధానం యిచ్చింది సూరమ్మ.

సూరమ్మ చదువుకొన్నది రెండవ తరగతే కాని - జీవితాన్ని ఆది ఒడపోసిన అనుభవజ్ఞురాలు.

ఇంతలో దొడ్లోనుంచి పరికిణీ కుచ్చిళ్లు ఎగరేసుకుంటూ, గెంతుకుంటూ మేనకోడలు సుజాత వచ్చింది అక్కడికి.

జాజిగుత్తులు ఎందుకో నవ్వుతున్నాయి మావయ్యా - అంది.

ఆ ప్రశ్నకు రైతు దంపతులు యిద్దరూ వారి చర్యను మరచి ఈ వింత ప్రశ్నకు చూపులు యిచ్చి చూస్తూ నిలబడిపోయారు. ఈ లోపల రామయ్య కాళ్లు కడుక్కోవడం, భోజనానికి సిద్ధం అవడం జరిగిపోయింది.

"ఇంతకీ అసలు విషయం చెప్పారుకాదు" - తిరిగి ప్రశ్నించింది సూరమ్మ.

"ఏం ప్రశ్న? ఎస్. ఎస్. ఎల్. సి పేపరా ఏమిటి" - మధ్యలో అందుకుంది తిరిగి సుజాత.

నువ్వు ఓడిపోయావు చూశావా? అన్నట్లు భార్యకేసి చూశాడు రామయ్య.

సూరమ్మ ఏం సమాధానం యివ్వలేదు యీసారి.
ప్రశ్నకోసం ఎదురు చూడలేమి రామయ్య. "విను"-అన్నాడు.
సూరమ్మ, సుజాతకూడ రామయ్యకు ముఖం గురిపెట్టి, చెవులు యింతచేసుకు నుంచున్నారు,

"ఇల్లు వదిలి తిన్నగా బయలుదేరాను, కాని ఎక్కడికో నాకు తెలియదు నా ప్రయాణం. నా మనస్సు రకరకాలుగా గాలిలో గాలిపటం లాగా ఊగులాడుతూంది నాకాళ్లు అవే యంత్ర నిర్మితంలాగ ఎక్కడికో పురోగమిస్తున్నాయి.

చివరకు నేను వెళ్లి నిలిచింది పోస్టాఫీసువద్ద. ఒక కవరు తీసుకొని విష్ణువర్ధనికి ఒక జాబు- అల్లుడికి ఒక జాబురాసి పడేశాను అప్పటికి నా మనసు ఎందుకో కొంత కుదుటపడినట్లయింది అంతేకాదు- మోసేబరువులో కొంతభారం వదిలినట్లయింది

"ఈమాత్రందానికేనా యింతసేపు అయింది మావయ్యా?"- మధ్యలో సుజాత ప్రశ్న.

"ఏమని రాశారండీ మన విష్ణుకు?"- ఆతృతతోకూడిన మాతృ హృదయం అడిగింది.

సుజాత వేసిన ప్రశ్నకు ఒక సమాధానం, శ్రీమతిగారు వేసిన ప్రశ్నకు ఒక సమాధానం- రెండు ప్రశ్నలకూ ఒకేసారి సమాధానం యివ్వడానికి నేనేం- అష్టావధానం తెలిసిన సిద్ధాంతినికాను- నాగలిపట్టి భూమి దున్నుకునే చిన్నరయితును కదా?-

"అయితే యింకనేం మావయ్యా, దున్నేవానిదే భూమి అని మన గ్రామగోడలనిండా నినాదాలు రాసివున్నాయి- చూశాను- అయితే నువ్వు చేస్తూన్న భూమి అంతా నీదే అన్నమాట" గోడమీద వినాదాలను ఎంతదాకా నమ్మాలో తెలియని సుజాత అడిగింది.

"అయితే రేపటినుంచి కౌలుకు భూమిదున్నుకునే రైతు రామయ్య గారు మంత్రంలాగా భూకామందు అయి కూర్చుంటారన్నమాట."

ఈమాట అని మనసులో సూరమ్మ కొంత గర్వపడక పోలేదు.

"దానికేం గాని, విష్ణుకి ధైర్యం కలిగిస్తూ జాబురాశాను. అక్కడి నుంచి తాశిల్దారుగారి ఆఫీసుకు బయలుదేరాను. ఈ విషయంలో మన ప్రెసిడెంటు చాలా సహాయపడ్డాడు.

మన అరటితోటను కమ్యూనిటీ బ్లాకుక్రింద చేర్చుకున్నారు - వారే ఎరువు యిస్తారుట, అందుకు ఆ ఖర్చుకోసం తెచ్చిన సొమ్ము మిగిలింది అంటే శెట్టి ముఖాన్ని కొట్టద్చు.

చెరువుక్రిందవున్న కృష్ణకాటుకు వేసిన చేను, అధికోత్పత్తి ప్రణాళికక్రింద - వారు చూస్తామన్నారు - అందుకు అమ్మోనియాపిండి మొదలయినవి, మిడుతలను తరిమేమందు, నీరు సునాయాసంగా పెట్టు కోడానికి ఒక మోటారు యంత్రం శాంక్షన్ చేశారు.

అదేకాదు - ఎకరాకి 20 బస్తాలల్లా 40 బస్తాలు పండిస్తే సువర్ణ పతకము యివ్వడమేకాకుండా - 500 రొఖ్ఖంగా బహుమతి యిస్తారుట.

ఎప్పుడోకాదు - సంక్రాంతి పండుగలకు మనగ్రామంలో ఆటల పోటీలు జరుగుతాయట - ఆ పెద్ద సభలోనే ఈ బహుమతి ప్రదానం కూడా జరుగుతుందట" - తన భవిష్యత్‌ను ఉపన్యాసంగా వల్లించి సంతృప్తిగా ఒక దమ్ము వదిలాడు రామయ్య.

అంతటి అదృష్టం మనకు కలుగుతుందంటారా?- ఆశతో ప్రశ్నించింది సూరమ్మ.

"కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు - నడుం వంచి పనిచేస్తే మానవుడు సాధించలేనిదంటూ ఏముంటుంది" సగర్వంగా సమాధానం చెప్పి - "సరే ఆత్మారాముడు గడబిడ చేస్తున్నాడు- వడ్డించు" - అంటూ వంటయింట్లోకి ప్రవేశించాడు రైతు రామయ్య.

రామయ్య పలుకులను యదార్థం చేస్తూ తాతలనాడు కొన్న గోడ గడియారం ఖంగ్‌మంది.

* * *

సాయంత్రం 5 గంటలు అయింది. అంటే విష్ణు భర్త ఆఫీసు నుంచి యింటికి వచ్చే టయిమయిందన్నమాట.

భర్తరాక కోసం- ఎంతో సంతోషంతో వీధిగడపనే బీటువేసుకు కూర్చుంది విష్ణువర్ధని. ఏనాడూ యింత సంతోషంగా, ధైర్యంగా, గడప అందులోనూ భర్తరాకకోసం ఎదురు నిలచి ఎరుకదు.

అవును- నిన్నటివరకూ విష్ణుబుర్రలో ఎన్నో అనుమానాలు, అవమానాలు, బాధిస్తున్నాయి- కాని నేడు వాళ్ళనాన్న జాబురాశాడు- అది చదువుకుంది. తను- ఆశించిన ఫలితం దక్కేలావుంది- ఇక తన భర్త తనను తిట్టడు- అత్తింటిమీద యుద్ధం ప్రకటించడు- తన సంసారం మందారమై మకరందాన్ని విరియిస్తుంది యిక.

"బుద్ధిలేదూ, సంసారివేనా? గడపను బల్లిలా అంటిపెట్టుకు కూర్చున్నావు?"- అప్పుడే గడపలో అడుగెట్టిన విష్ణువర్ధని భర్త విష్ణువర్ధనికిచ్చిన సంధ్యాసమయ ఆశీస్సులు.

నిన్నటివరకూ ఈ తిట్లు తినడం అలవాటే- నేడు యీ తిట్లు యింకా తినడం కొంచం బాధగానే తోచింది.

ఎంతో బాధపడ్డది విష్ణువర్ధని. మరి బాధకదూమరి?- తనభర్త ఎప్పుడు వస్తాడాఅని ఎదురునిలచి, తనతండ్రి రాసిన ఉత్తరంలోవి వార్తలు- భర్తకోపాన్ని చల్లార్చే విషయాలు- భర్త అలుగుకు నలుగెట్టే సమాచారం- చెబుదామా అని ఎదురుచూసిన స్త్రీ మనసు ఈ ఆశీర్వచనాలతో చివుక్కుమంది. కళ్ళు బాధతో వర్షించాయికూడాను.

అంతదాకా పమిటలోపల- వెచ్చగా దాచిన ఉత్తరాన్ని పైకి తీసింది- చేతులలోవుంచుకొంది- కాని ఫలానావిషయమని నోరువిప్పి ఏం చెప్పలేదు విష్ణువర్ధని. ఆలా మూగనోము పట్టుకొనివుండటంలో అర్థం- తనకు ఉత్తరంలోని వార్తలను భర్తదృష్టికి తేవాలని లేకకాదు- ఆతృతగానేవుంది. కాని....

ఎంత కోపిష్టిభర్త అయితేమాత్రం, ఎంతకోపం వుంటేమాత్రం యిలా అనడమేనా? అందుకే తను మూతి ముడుకుని నిలుచుంది విష్ణువర్ధని.

"ఏమిటా చేతిలో"-? ధిక్కారమును సైతునా అన్న గగ్గయ్య పోజులో హూంకరించాడు భర్త.

"నాన్న....గారూ...." భయంగానే సమాధానం యిచ్చింది.

ఈ మాటకు మండిపడ్డాడు భర్త. మామగారంటే గౌరవం వుంది. కాని తనకు జరగవలసిన కొత్త అల్లుడిగా గౌరవాలు జరగలేదు, వస్తాయనుకున్న పండుగ పిలుపులు రాలేదు. అందుకే యింతకోపం.అందుకే ఈ తాపం.

దగ్గరగావచ్చి - భయంతోనే - "నాన్నగారు మీకు రాశారు"- ఉత్తరాన్ని అందించి దూరంగా వెళ్ళిపోయింది.

చికాకుతోనే పర్రున కాగితాన్ని కవరునుంచి తీసి - ఒక్క నిముషములో చదివేశాడు - అంతదాకా. భర్తముఖాన్ని తదేకదీక్షలో చూస్తూనే వుంది విష్ణువర్ధని.

గాలితక్కువయి కాంతి విహీనమయిన పెట్రోమాక్సులైటుకు గాలి గొట్టేకొలదీ కాంతి వచ్చినట్లు—

ఆ ఉత్తరంలోని ఒక్కొక్క పేరాయే చదువుతూన్నకొలదీ తనలో మార్పు వచ్చింది - అది గ్రహించలేకపోలేదు విష్ణువర్ధని.

అయినా పలుకలేదు.

ఉత్తరం అంతా ముగించాడు - భార్య దగ్గరగా వచ్చాడు. అతనిలో ఏదో సంతృప్తి - గర్వం - మిలమిలలాడుతున్నాయి.

"పలుకరాదటే చిలుకా

అలుకలేలనే చిలుకా" - సంగీతం మొదలుపెట్టి విష్ణువర్ధని బుజాలమీద తనచేతులను అన్చి బలంగా ఆత్మసంతృప్తితో ఒక శ్వాస విడిలాడు.

"అలుగు అలిగి కూర్చున్నది మీరా - నేనా?" - కళ్లు చిట్లిస్తూ ప్రశ్నించి - పాపం చాలా కష్టపడ్డారు కార్కుగారు - వేడివేడి కాఫీ యిస్తా - అంటూ చిలుకలాగే తుర్రుమంది విష్ణువర్ధని.

* * *

రామయ్య చెరువవతల చేలో కోతలహడావిడిలో మునిగివున్నాడు. ఒకమూల కోత సాగుతూంది, ఒకచోట కుప్ప వేస్తున్నారు. ప్రక్కనే కుప్పకొట్టుడూ _ ధాన్యం ఎగరపోత జరుగుతున్నాయి

వాతావరణం చాలా ప్రశాంతంగా _ చూడముచ్చటగా వుంది. దూరంగా గువ్వలగుంపు ధాన్యాన్ని బొక్కుతూ గెంతులు వేస్తున్నాయి. రామయ్య యింత పొడుగుపాటి లంకచుట్ట ముట్టించి - కాళ్ళు మడత వేసుకు బల్లలో కూర్చున్నాడు.

రామయ్యకు నాలుగుగజాల దూరంలో చాకలి మంగలి,మామూలు అంటూ వచ్చి తట్టలు పుచ్చుకు నుంచున్నారు.

"నందామయా గురుడ

నందామయా..." తంబురతాత ముష్టికి ఎదురు చూస్తున్నాడు.

చేలను దూసుకు పైరుగాలి జువ్వుమంటూ వస్తూంది. బారులు తీరిన కూలిజనం ఆడగుంపు, మగగుంపు లైనుగా కొడవళ్లు ధరించి వరి చేనును కోస్తున్నారు. అందులో ఒక పల్లెపడుచు చక్కని వరుసలో గొంతెత్తి పాడుతూంది.

వాడివాడనిపువ్వు తుమ్మెదా
విచ్చివిచ్చనివువ్వు తుమ్మెదా
ఇది కోనసీమాచేను తుమ్మెదా
ఇది కోటి వరహాలే తుమ్మెదా
కూడుగుడ్డలాకు తుమ్మెదా
కరువుకానరాదు తుమ్మెదా
రామయ్య రైతంటె తుమ్మెదా
శ్రీరాముడంతటివాడు తుమ్మెదా
దానధర్మంలోన తుమ్మెదా
బహుపెద్ద చెయ్యాయంది తుమ్మెదా....

పాట బహుచక్కగా సాగుతూంది. అందుకు తగ్గట్టు కొడవళ్లు తాళం వేస్తూన్నాయా అన్నట్లు చెకచెకానడుస్తున్నాయి. ఆ ప్రకృతిశోభ- ఆ వాతావరణం చూడముచ్చటగా- కన్నులపేడుకగా ఎంతో మనోహరంగా వుంది.

అస్తమయ భానుడు నీరెండలను ప్రసరింపచేస్తున్నాడు- ధాన్యాన్ని బస్తాలలోకి కొలుస్తున్నారు కూలీలు, మామూళ్లు లేదనకుండా రామయ్య కొలిపిస్తున్నాడు.

గంటలు గంగడోళ్లు క్రింద ఘనఘనమ్రోగుతూ పంటలచ్చికి స్వాగతం పలుకుతూన్నాయి.

బళ్లనిండా ధాన్యం బస్తాలు ఎక్కించారు. కూలిజనం చేతులు కడుక్కొని కొడవళ్లు అందించుకుంటూ తుమ్మెదగుంపుగా కిచకిచలతోటీ పకపకలతోటీ గూళ్లకు బయలుదేరారు.

రామయ్య పెద్దనౌకరు వీరిగాడు, చిన్న నౌకరు అచ్చుడు కర్రలు చంకలో పెట్టుకొని ధాన్యలక్ష్మికి బాడీగార్డుల్లా నుంచున్నారు_ వారి శరీర సౌష్టవం గిడుగుపిడుగును జ్ఞప్తికి తెస్తూంది.

ఆ కొత్తగడ్డిని రామయ్య కర్రావు నములుతూంటే- కొత్తకొత్త చూపులతో ఆనందంగా రామయ్య చూస్తున్నాడు. రామయ్య చేతిలో ధాన్యం కంకులతో అల్లబడిన ధాన్యం గుత్తిమీద ధైర్యంగా ఒక రామ చిలుక వాలి గింజలు కొరుకుతూంది- రామయ్య ధర్మగుణాన్ని గుర్తించిన జీవిలాగ.

"సరే, వీరిగా - ధాన్యంబళ్ళను ఇళ్ళకు పట్టించండి" - నోట్లో చుట్ట క్రింద పడేస్తూ చెప్పాడు రామయ్య.

గంటలను గలగల లాటించుకుంటూ ధాన్యంబళ్ళు కదిలాయి. ముందర బండిమీద ఎర్రటి సిల్కు తలపాగా చుట్టుకుని, చేతిలో తోలు కర్ర ఆడించుకుంటూ హుందాగా రామయ్య ఆసీనుడయ్యాడు.

చారిత్రకదృష్ట్యా ధర్మరాజుపాత్ర గొప్పదే అయి వుండవచ్చును- కాని నేడు-అక్కడి కూలిజనం దృష్టిలో ఆ రామయ్య ఒక ధర్మరాజు.

రామయ్య యిల్లు సమీపిస్తున్నాయి ధాన్యంబళ్లు, ధాన్యంబస్తాలతో నిండిన ఆ బళ్లు - గంటల ధ్వనులతో, నడుస్తూంటే పెళ్ళివారి ఊరేగింపు లాగానే వుంది.

ఆ బళ్లు సరిగా గ్రామంమధ్యకు వచ్చాయి. ఆమధ్యనే వడ్డీవ్యాపారి శెట్టిమేడ - ఆదేదారి రామయ్య యింటికి.

"రామయ్యా" - వెనుకనుంచి ఎవరో పిలుస్తూన్నట్లు అయింది. తనకు ఆ పిలుపు వినిపించింది - వెనకకు తిరిగిచూసినా ధాన్యం బస్తాలు తనకళ్ళకు అడ్డువస్తాయి - అందుకు రైతురామయ్య - "వీరిగా- ఎవరు పిలిచేది-" అని నౌకరు వీరిగాడిని హెచ్చరించాడు.

"ఎవరుంటారు యీ సమయంలో- పిలవడానికి బాబయ్యా. దూడ నచ్చిందంటే గద్దలకు కబురు పంపక్కర్లేదుట...అలాగే యీ వడ్డీ రాజులకుకూడా యిట్టే కబురు అందుతుంది - యిటువంటి సమయంలో అతడే వడ్డీశెట్టే"- తుమ్ముకుని, తనకుతానే చిరంజీవి అనుకొనే వీరయ్య సునాయాసంగా సమాధానం పలికి - ఎందుకో ఒకసారి చంకన వున్న కటిక కర్రను చేత్తో సవరించుకుని వెనుకకుచూస్తూ నిలుచున్నాడు.

బండినుంచి దిగాడు రామయ్య. ఆగమన్న హుకుం అవసరం లేకుండానే ఎద్దులు ఆగాయి రామయ్యతోపాటు విశ్వాసానికి కట్టుబడే ఆ జంతువులు-

ఎదురుగుండా శెట్టిప్రక్కనే నలుగురు కావలాదార్లు, రామయ్యకు ప్రత్యక్షమయారు. ఆ మనుష్యులను చూడగానే రామయ్యకు గుండె దిబుక్కుమంది. అది పాత అలవాటు- కాని అంతలోనే సముదాయించుకున్నాడు రామయ్య. రామయ్య ఆ సమయంలో అలా చిన్నబుచ్చుకున్నట్లుగా కనుపించగానే- నమ్మిన ప్రక్క నౌకర్లు సహించలేకపోయారు- ఎందుకో ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకున్నారు- ఆ చూపులలోని అంతరార్థం నమ్మకానికి ప్రతిబింబాలనదగిన ఆ కూలీ హృదయానికే తెలియాలి.

"నమస్కారం శెట్టిగారూ"- ఒడుదుడుకులు లేకుండా- శాంతముగా సమాధానం యిచ్చాడు రామయ్య.

నోటితో తిరిగి ప్రత్యభివందనం చెయ్యకుండా తలకాయను ఒకసారి వూపాడు శెట్టి.

శెట్టి వెనుకనే నిలబడిన, డబ్బుకోసం గడ్డికరిచే నలుగురురౌడీలు ఆ సమయంలో ఎందుకో వికటంగా నవ్వలేదుకాని- మూతి చిట్లించు కున్నారు.

"బాగానే రాలుబడి వచ్చినట్లువుంది" ధాన్యం బస్తాలను తదేక దీక్షతో చూస్తూ ప్రశ్నించాడు శెట్టి.

"బాగానే రాలింది- ఒకటికి ఒకటి ఎక్కువ పండింది ఈ ఏడు. రామయ్యగోరి యవసాయం అంటే యేటనుకున్నారు"- సగర్వంగా సమాధానం శెట్టికి యిచ్చి- ఆమాట ప్రక్కనేవున్న రౌడీలముఖంలో ఏం మార్పు తీసుకొచ్చిందో అని వారి ముఖాలలోకి ముఖాన్నిపెట్టి చూడ సాగాడు నౌకరు వీరయ్య.

వీరయ్య నమ్మిన పనివాడే- అయినా యింతల్లా సమాధానం యిస్తాడని తలుచని రామయ్యకు యీసమాధానం ఆశ్చర్యం కలిగించింది. అయినా లోలోపలే అనుకున్నాడు- "వీరయ్య లాంటి మనుష్యులు ఏకులంలో వుంటేమాత్రం ఏమిటి?" అని.

"రామయ్యా, ధాన్యం చేలోనే కొలుస్తానని వాగ్దానం చేశావు. అసలు సంగతే చెవినిపడనియ్యలేదే?" ఎత్తి పొడుపుగా అడిగాడు శెట్టి.

అప్పటికే రామయ్య శెట్టికివ్వవలసిన సమాధానం సిద్ధం చేసు కున్నాడు

"అవసరం లేదనుకున్నాను. మీకుయివ్వవలసింది ధాన్యరూపంలో కాకుండా డబ్బురూపంలోనే యివ్వడం గౌరవమని భావించి....

"ఏమిటీ?" మధ్యలో శెట్టి గదమాయించాడు.

"ఏమిటీలేదు-గీమిటీలేదు - నీకు సొమ్ముకదా ముట్టవలసింది." నిర్మొహమాటంగా ప్రతిగాపలికి-రామయ్యే తిరిగి అన్నాడు.

"ఈరోజు-కొత్త ధాన్యం అమ్మజూపితే బస్తాఒకటికి 12 రూ.లు పలకడం దుర్లభం. ఈ బస్తా ధాన్యమే కష్టపడి ఒక్క-రెండు నెలలు దాస్తే 24 రూ.లు. పాతధాన్యం క్రింద చెలామణీ అవుతుంది. అయినా శెట్టిగారూ, ఈ ధాన్యం దాచడం, అమ్మడం, సొమ్ముచేసి పెట్టడం బాధ్యతలు ప్రభుత్వంవారే తీసుకున్నారు." అసలు విషయం సూక్ష్మంగా శెట్టి చెవిని వేశాడు రామయ్య.

తనుకలలోనైనా వూహించని పద్ధతిలో ఎదురుతిరిగింది కార్యం. తోకత్రొక్కినత్రాచులాగా అయిపోయాడు శెట్టి.

"ఓహో. యిదంతా ప్రెసిడెంటు మీకు నేర్పించిన పాఠం. తెలిసిందిలే రామయ్యా, యిదంతా కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమం క్రింద జరిగిన అధికోత్పత్తి కార్యక్రమమని. లేకపోతే అన్నిధాన్యం బస్తాలు ఏనాడు నువ్వు కళ్లజూశావు?"—

"నిన్నచూడని మాట నిజం. కాని నేడు చూడగలుగుతున్నాను. రేపుయింకా చూడగలుగుతానని నమ్మకంగా హృదయం ఘోషిస్తూంది." నరికినట్లు సమాధానం యిచ్చాడు రామయ్య.

"వీరయ్యా, పంటలచ్చిని దారిలో నిలిపిమాటలేమిటి - పోనియ్యి బళ్ళను"—రామయ్య హుంకుంజారీ అవడమేమిటి - రామయ్య ధైర్యానికి సెభాష్ అన్నట్లు మువ్వలు వాయించుకుంటూ బళ్లు కదిలాయి.

ఇంతనిర్లక్ష్యమా - అనుకున్నాడు శెట్టి. ఉఁ.... అని బాడిగార్డులకు కన్నుగిటాడు.

నలుగురూ కర్రలు పైకెత్తి - "ఆపు బళ్ళని" - అన్నారు రాక్షసత్వాన్ని గుర్తుకుతెస్తూ.

రామయ్య గుండె ఆగినంతపనయింది - అసలు యిటువంటి పేచీలు అంటే ఆమడదూరంలో వుంటాడు రామయ్య.

నూతిలోంచి పట్లాడినట్లు - సన్నగా - "వీరయ్యా, ప్రమాదం ముంచుకొచ్చింది లాభంలేదు - పంటలచ్చిని రక్షించుకోవలసినభారం భూదేవికి అప్పచెప్పి - బళ్ళను ఆపండి" అన్నాడు. రామయ్య అంత దాకా తలమీద సగర్వంగా వుంచుకున్న ఎర్రతలపాగా తీసేశాడు. ఆనందంతో కళకళలాడిన రామయ్య కళ్లు తడితో వెలవెలబోయాయి.

చూచాడు నౌకరు యీరిగాడు. కామందుకు - అందులో రామయ్య లాంటి ధర్మప్రభువుకు యిలా జరగడం సహించలేకపోయింది యీరిగాడి హృదయం.

రైతురామయ్యను ఆ సమయంలో ధిక్కరించి తన కర్తవ్యం నిర్వర్తించాలనుకున్నాడు. అనుకోవడంతోటే సరిపుచ్చలేదు - ...."బండి ఆపడానికి వీలులేదు - కావాలంటే నేను అగుతాను" - గుండెల్లోంచి బలంగా సవాలుపలికి ... "పోనియ్యి బళ్ళను" - తోటిమనిషికి ధైర్యం యిచ్చాడు. బళ్లు కదలాయి. రామయ్య బరువుగానే బండిని అనుసరించాడు.

"అగు రామయ్యా" శెట్టి గొంతు కోపంతో ఉరిమింది.

ఆ ఉరుమును చీల్చుకొని పడ్డ పిడుగులాగ ఒక బలమయిన కటిక కర్ర యీరిగాడి నెత్తిమీద టప్‌మని పడింది.

ముందుకు పడిన రామయ్య కాలునిలపడిపోయింది. యీరిగాడితల చిట్లిందని ఒణికిపోయాడు రామయ్య.

"యీరిగా" - అంటూ బెబ్బులిలాగ యీరిగాడిని చేరుకొన్నాడు. కాని జరిగింది అసలు అదికాదు - ఈరిగాడితల చిట్లలేదు. శెట్టి ఎప్పుడో అక్కడినుంచి మాయమయిపోయాడు. అక్కడవున్నది నలుగురు శెట్టి రౌడీలు - ఒక్క యీరిగాడు. అయితేనేం - పులిలాగ పోరుతున్నాడు - ఆ నలుగురూ దెబ్బలాడుతున్నది డబ్బుకోసం - యీరయ్యది డబ్బు

ప్రేమకాదు - నమ్మిన కామందుయందు తనకున్న బలమయిన ప్రేమ. ఆ నలుగురూ నాలుగు వెంపులా కర్రలు తిప్పుతున్నారు. ఈరిగాడు పులి అడుగువేస్తూ సాముతో మూడుచెరువుల నీళ్ళుతాగిస్తున్నాడు.

రామయ్య వెనకాలే - రెండో నౌకరు బళ్ళను అక్కడే ఆపి అక్కడికి వచ్చాడు - కాని అప్పటికే రౌడీలు కాలికి బుద్ధిచెప్పారు.

వెళ్ళిపోతూన్న నలుగుర్నీ ఒకసారి గర్వంగాచూసి - తన కర్రని చరుచుకున్నాడు యీరిగాడు-

"ఎంత ధైర్యం చేశావు యీరయ్యా" రామయ్య బుజం తట్టాడు.

ఈరిగాడు ఏం మాట్లాడలేదు, ముగ్గురూ బళ్ళవద్దకు బయలు దేరారు - కాని ధాన్యంబళ్లు అక్కడ లేవు.

"అరే" నాలుక కరచుకున్నాడు చిన్ననౌకరు. "ఏమిటిది? - ఆశ్చర్యంగా అడిగాడు ఈ౯ియ్య.

"అయ్యో ధాన్యం బస్తాలు. బళ్లూ ఏమయాయో?" రుద్ధకంఠంతో అరచాడు రామయ్య.

"మావయ్యా," ఎదురుగుండా మేనకోడలు కనిపించింది. నోటంట రామయ్యకు మాట. పెగలలేదు.

"ధాన్యం బళ్లు మన గుమ్మంవద్ద నిలచాయి. ఎవరూ బండిలో లేరు. అత్తయ్య భయబడిపోతూ మామయ్యను చూసిరమ్మని నన్ను పంపి" పరుగెత్తిన అయాసాన్ని తమాయించుకుంటూ చెప్పింది సుజాత.

ముగ్గురి ముఖాలూ జ్యోతుల్లా ఒక్కసారి తేజోవంతమయాయి. అందరూ యింటికి బయలుదేరారు.

వరుసగా ధాన్యంబళ్లు గడపలో నిలుచున్నాయి. సూరమ్మ ఆతృతగా భర్తకోసం వాకిట నిలబడి ఎదురుచూస్తున్న కంటికి భర్త, సుజాత, నౌకర్లు

కనిపించారు. పెదాలు నవ్వులు చిందించాయి. ముఖం ఆనందంతో కళ కళలాడింది.

సూరమ్మ వెంటనే లోనికి వెళ్లి పళ్లెంలో దీపం పెట్టుకొని వచ్చింది-అందుతోనే కొబ్బరికాయకూడాను.

పంటలక్ష్మికి హారతిచ్చి. కొబ్బరికాయ కొట్టింది. రామయ్య ఆనం దానికి మేరలేదు. ఆ ఆనందలో తమకూ పాలువున్నట్లు ఎద్దులు గంగ డోళ్లు ఆడించి మువ్వలు ధ్వని చేశాయి.

దూడలను చేత్తో రాస్తూ- "నమ్మకం అనేది ఎవరిలో వుంటే నేమిటి-దూడలుకూడా నాకు సహాయం చేశాయి. మనుష్యులు చిక్కుల్లో చిక్కుకుంటే ధాన్యాన్ని ఎవరో చెప్పినట్లు యింటికి చేర్చాయి".-

నౌకర్లు దాన్యం బస్తాలు యింట్లోకి చేరుస్తున్నారు. రామయ్య వరికంకెలగుత్తిని గుమ్మం పొదిగట్ల పిచికలకోసం వ్రేలాడకడుతున్నాడు.

* * *

"ఎప్పటికీ తెమిలేటట్లు లేదు - నీ సింగారింపు: మనకోసం రైలు బళ్లు ఆగవు"—

"గుర్రబ్బళ్ళో" అద్దంలో ముఖం చూసుకుంటూనే విష్ణువర్ధని సమాధానం.

"ఏడిసినట్టేవుంది నీ సమాధానం."—

"నాముఖమో?" పౌడరుతో పులిమిన ముఖాన్ని భర్తముఖంమీద పెట్టి అడిగింది తిరిగి.

"భలేగావుందిలే - పగటివేషగాళ్ళను జ్ఞప్తికితెస్తూ" - నవ్వుతూ అన్నాడు భర్త.

"అయితే నేను ఈరోజు బయలుదేర దలచలేదు" - మూతిముడి చింది విష్ణువర్ధని.

"సరే. యిల్లు జాగ్రత్త - నేనే బయలుదేరి వెడతాను" - కాలికి జోడు తగిలించాడు.

అంతకీ ఘనుడే _ అంతపనీ చేస్తాడు - యిక లాభంలేదు - అనుకొంది - నేనూ సిద్ధం అయాను - నడవండి అంటూ వీధిలోకి దారి తీసింది విష్ణువర్ధని.

వీధిలో ఎవరిదో గుర్రంబండి వచ్చిఆగింది - ఎవరా అనుకొన్నారు భార్యా భర్తలిద్దరూ. అసలు ఈ సమయంలో తమయింటికి రావలసినవారు ఎవరూ కూడా లేరు. వస్తూన్నట్లుగానైనా ఎవరూ ఏం వ్రాయలేదు.

ఎవరైవుంటారు ? యిద్దరికీ ఆలోచనలే, అనుమానాలే.

"పిన్నీ" అంటూ ఒక కుర్రవాడు బండిలోంచి దిగాడు.

ఆశ్చర్యపడిపోయింది వర్ధని. ఎవరోకాదు, ఆ కుర్రవాడు వర్ధని అక్కకొడుకే. దగ్గరగా తీసుకుని ముద్దెట్టుకుంది వర్ధని ఆ కుర్రవాడిని.

"ఇలా చిక్కిపోయావేమిటే వర్ధనీ"- బండిలోంచి దిగీదిగడంతోటే చెల్లెల్ని అడిగింది అక్కగారు ఆప్యాయతగా.

ఓ నవ్వునవ్వి వూరుకుంది వర్ధని-సమాధానం ఏంయివ్వలేదు.

వర్ధని భర్తమాత్రం ఒదినగారిని ఉద్దేశించి - "కొంచం తిండి ఎక్కువయింది"- అని - భార్యవర్ధనిని వోరగా చూడసాగాడు.

"కొంచం తిండితగ్గిస్తేసరి"- మరదిని వేళాకోళంగా చూస్తూ సమాధానం యిచ్చింది ఒదినగారు.

"సరే - యిక్కడే నుంచున్నారేమిటి? నడవండి లోపలికి, అంటూ విష్ణు లోనికి దారితీసింది.

అందరూ లోనికి ప్రవేశించారు.

"ఏమండీ, రైలు యిందాకా మనకోసం ఆగవన్నారే - మరి యిప్పుడు అగమని చెప్పివచ్చారా?"- చిలిపిగా భర్తను ప్రశ్నించింది వర్ధని.

అందరూ పకపకమంటూ నవ్వుల్లో మునిగిపోయరు.

"వర్ధనీ-హోటల్లో ఫలహారాలు అయాయి-యిక ఏప్రయత్నమూ. చేయకు-నాకేం మొహమాటమా?యీ బండికే బయలుదేరాలి అందరం."

'ఎక్కడికేమిటండోయి?"- నిద్రనుంచి లేచినవాడిలా ఏమీ తెలియనట్లు అడిగాడు విష్ణువర్ధని భర్త.

"ఎక్కడికేమిటి? మామగారు జాబురాయలేదా ఏమిటి?"- ఆశ్చర్యంగా ప్రశ్నించాడు తోడిఅల్లుడు.

తిరిగి తనే- "సంక్రాంతికి అందరినీ రమ్మని జాబులురాశానని, అందరూ వస్తున్నారనీ, కనుక మీరు బయలుదేరి వస్తూ వర్ధనిగారింటికి వెళ్లి, వారిద్దర్నీ వెంటబెట్టుకురమ్మనీ మరీమరీ వ్రాశారు-అందుకే అటు వెళ్లేది ఇటువచ్చి మిమ్మలను వెంటబెట్టుకొని వెళ్లడంకోసం యిలా వచ్చాము. యింక ఆలస్యం చేస్తే- బండిదొరకదు. పండుగకు ముందరే జేరుకోలేము. కనుక బయలుదేరడం మంచిది"-అంటూ విషయాన్ని సంగ్రహంగా చెప్పాడు.

"ఆలస్యం అమృతం విషం ... అన్నారు పెద్దలు కానివ్వండి. ఈ బండికే బయలు దేరుదాం" - వర్ధనిభర్త సమాధానం.

"ఆలస్యం అమృతం అన్నారేమో అనుభవజ్ఞులు" - భర్తను చూస్తూ ప్రశ్నించింది. తనలో తాను ఒకసారి నవ్వుకొంది వర్ధని.

అందరూ అదే బండికి బయలుదేరారు. తోడిఅల్లుళ్ళు ఒకచోట కూర్చుని వారి సమస్యలను గురించి చర్చించుకుంటున్నారు.

అక్కా, చెల్లెలూ ఒకచోట ఏదో చెవులు కొరుక్కుంటున్నారు. పిల్లలుమాత్రం - బిస్కట్లు పొడిచేయడంలో మునిగివున్నారు.

వీరితో సంబంధం లేదన్నట్లు ధూమశకటం దూసుకుపోతూంది గమ్యాన్ని వెతుక్కుంటూ.

* * *

"అత్తయ్యా, అత్తయ్యా." గుమ్మంలో నుంచున్న సుజాత హడావిడిగా పిలుస్తూంది.

బండికి, వ్యవసాయపు పనిముట్లుకూ రంగులూ పసుపుకుంకుమలూ పూస్తూ దొడ్లోవున్న రామయ్యకు యీ పిలుపు చెవుల్లో గుయ్‌మంది.

"ఏమిటే సుజా" - అక్కడినుంచే అడిగాడు మేనమామ.

"ఏముంటుంది. ఏ సంక్రాంతి జియ్యరో కనుపించివుంటాడు. చూసిగెంతుతూన్నట్లుంది. అంతకన్న ఏముంటుందీ" - వడమటింట్లో వున్న కిటికీగుండా భర్తకు సమాధానం ఇచ్చింది సూరమ్మ

"అదికాదే, బండివచ్చేవేళ అయింది. అమ్మాయికాని వచ్చిందేమో అనుకుంటాను. చూడు" అంటూ తనూ గడపలోకి వచ్చాడు. ఆ వెనుకనే సూరమ్మవచ్చింది. స్టేషనునుంచి గుర్రంబండీలు రెండూ ఆ సమయానికే అక్కడకు వచ్చాయి.

"చూశావా? నేనన్నానుగా" - జ్యోతిషం ఫలించిందన్న ధీమాగా సిద్ధాంతిలా అన్నాడు బళ్లనుచూస్తూ రామయ్య.

సుజాత మాటఅంటే అంతనమ్మకం లేక వూరుకున్నాను - ఓటమిని అంగీకరిస్తూ సమాధానం యిచ్చింది సూరమ్మ.

"బలే, బలే"...గెంతడం మొదలు పెట్టింది సుజాత

ఒక పెద్ద బిందెడు నీళ్లూ, ఒక చెంబూ పట్టుకువచ్చి గడపలో పెట్టాడు. నౌకరు వీరయ్య.

పారాణినీళ్లు దిగదుడిచి రోడ్డుమీద పోసి-కాళ్లు కడిగింది-అందర్నీ లోనికి తీసుకెళ్లింది సూరమ్మ.

పచ్చని తోరణాలు, పసుపుకుంకుమలతో అలంకరించిన గడపలు, తెల్లగా వెల్లచిలుకరించిన గోడలు-ఎక్కడచూసినా రకరకాల ముగ్గులూ, అందుకుతోడు యింటికి నిండుగా అల్లుళ్లు, కూతుళ్లు, పిల్లలూతో-కలకల లాడుతూ పెళ్లివారిల్లులావుంది - లక్ష్మి అంటే ఓ యనిపల్కేలాగ.

రైతు రామయ్య ముఖంలో సంతృప్తి తొణికిసలాడుతూంది. సూరమ్మ ఆనందం చెప్పనే అక్కరలేదు.

ఏనాడూ - ఏ పండుగకూ గడపతొక్కని అల్లుళ్లు అలిగిన చిన ల్లుడితోసహా అందరూ ఈనాడు గడపలో కాలుపెట్టడం ఎంతో ఆనందం కలిగించింది.అటువంటి శుభదినం కోసం ఎన్నోవిధాల ఎదురుచూసింది-దేముళ్లను ప్రార్థించింది సూరమ్మ.

"ఇదిగో నేను అవసరంగా వెళ్లాలిసిన పనుంది - కచేరీ సావడి వద్దకు - అరటిగెలల ప్రదర్శనానికి హాజరవాలి, అధికోత్పత్తిచేసిన రైతుకు ఈరోజు బహుమానాలు యిస్తారు-

రైతు రామయ్యకూడా అందులోవాడేకదూ మరి. " అందరూ భోజనాలు చేయండి. కొంచం ఆలస్యం అయినా వస్తా"- అనిచెప్పి రైతు వేషంలో - తలపాగా, కాలికి కిర్రుచెప్పులు, ఉప్పాడపంచ, నోటిలో చుట్ట, చేతిలో కర్ర, బుజాన రుమ్మాలు - బయలుదేరి వెళ్లాడు రామయ్య.

కచేరీ అంతా అధికారులతోనూ, కమ్యూనిటీబ్లాక్ నిర్వాహకుల తోనూ, ప్రజలతోనూ, చాలా సందడిగావుంది.

రైతులందరూ గుంపులుగుంపులుగా చేరారు. ఒకచోట అరటిపళ్ళ ప్రదర్శనం, ఒకచోట మేలుజాతి పశువులప్రదర్శనం, ప్రక్కనే సంక్రాంతి

ఆటలపోటీలు, ఫెళ్ మంటూ ఓ పెద్ద తీర్థంగావుంది ఆ దృశ్యం, ఆ వాతావరణం.

ఎవరిమట్టుకువారే విజయానికి స్వాగతం పలుకుతున్నారు.

సభ ప్రారంభమయింది. ఆటల్లో గెలిచిన యువజనులకు బహుమతి ప్రదానం జరిగింది. అరటిగెలను చాలా పెద్దగా పిండితో పెంచిన ఘనత ఒక రైతునకు వచ్చిందని ప్రకటన కూడా జరిగిపోయింది.

ఇక జరగవలసింది - పంటల బహుమతి ప్రదానం ఒక్కటే - ప్రతిరైతూ తనకు వస్తుందంటే తనకు వస్తుందని లోలోపల తలచుకుంటూ క్షణాలను బలవంతంగా త్రోస్తున్నారు. రామయ్యకూడా అందరితోపాటే - తనూ రైతే - తనూ పోటీదారే.

ప్రకటన ప్రారంభమయింది.

ఈ సంవత్సరం అధికోత్పత్తి కార్యక్రమం క్రిందకు తీసుకున్న చేలు - ఐదురుగు రైతులనుంచి - ఈ పంటల అంచనాలను సరిగా కట్టడంకోసం ఐదుగురుగల పరిశీలకసంఘాన్ని నియమించాం.

వారి పరిశీలన ప్రకారం ఈనాడు ప్రథమ బహుమతి శ్రీరామయ్య అనే రైతుకు వచ్చింది.

వీరు ఎకరాకు 40 బస్తాలధాన్యం పండించి ప్రధాన బహుమతిని పొందారు.

రెండవ బహుమతిని 33 బస్తాలు పండించిన శ్రీ వెంకన్నగారికి, 27 బస్తాలు పండించిన మూడవ బహుమతి శ్రీ సూర్యనారాయణగారికి వచ్చాయి

అందుకుగాను ప్రథమ బహుమతి దారైన శ్రీ రామయ్యగారికి 500 రూపాయలూ, ఒక స్వర్ణపతకం - ప్రభుత్వపరంగా - అధికోత్పత్తి సాధించిన రైతు రామయ్యగారికి యిస్తున్నాం"- ప్రకటన ముగిసింది.

రైతు రామయ్య స్టేజిమీదకు ఎక్కాడు. సభికులకరతాళధ్వనులు మిన్నుముట్టాయి. స్వయంగా కలెక్టరుగారు పూలదండ రామయ్యకు వేశారు. రామయ్య చొక్కాకు బంగారు పతకం తగిలించారు - 500 రూపాయల కొత్తనోట్లకట్ట రామయ్యకు అభినందిస్తూ అందించారు.

ఈ గౌరవం, ఈ బహుమతులు - తనకు అందిన రామయ్య గర్వంతో ఉప్పొంగిపోయాడు. ఏదోలోకంలో విహరించసాగాడు - ఆ ఆనందంతోనే - సగర్వంగా యింటికి వెళ్లాడు రామయ్య.

తనభర్తకు జరిగిన ఈ గౌరవంచూసి మురిసిపోయిందిసూరమ్మ. మిలమిలా మెరుస్తూన్న మెడలుమీద కన్నేసి ఏదో ఆలోచిస్తూ చూడ సాగింది మేనకోడలు సుజాత.

అల్లుళ్లు, కూతుళ్ళ ఆనందం అవధులను దాటింది.

ఆ ఆనందంతో సంక్రాంతిని ఎంతో వేడుకతో జరుపుకున్నారు.

సంక్రాంతి పండుగ రెండవరోజు బహుమతులరోజు. పెద్ద అల్లుడికి, పెద్దకూతురుకూ, పిల్లలకూ బహుమతులు యిచ్చాడు. చిన్న అల్లుడికి లెక్కతప్పకుండా లెక్కకట్టి అన్ని పండుగలకూ కలిపి బహుమతి అందించాడు - విష్ణుకు కొత్తదుస్తులు అందించాడు - సుజాతకు కొత్త పరికిణీ చొక్కా యిచ్చి దీవించాడు.

అంతటితో ఆపలేదు-నౌకర్లు యిద్దర్నీ పిలిచాడు. కొత్తపంచలూ. ఖండువాలూ యిచ్చాడు - యిద్దరికీ ఒక్కొక్క బస్తా ధాన్యం కొలిచాడు. పిండివంటలతో భోజనాలు చేశారు. ఎవరిముఖంలో చూసినా ఆనందం ప్రతి ఫలిస్తూంది - అందరి హృదయాలూ ఆనందపూరితంగా వున్నాయి.

క్రితంలో ఏ పండుగనాడూ ఏదో ఒక సమస్య, ఏదో అసంతృప్తి- ఏదో ఆలోచన - కాని నేడు ఏ సమస్యాలేదు, ఏ అసంతృప్తి లేదు.

కొత్త దుస్తులు ధరించి, ఆనందంగా అల్లుళ్ళు, కూతుళ్లు, మనుమలమధ్య కులాసాగా కూర్చున్నాడు రామయ్య.

"ఏమిటి మామయ్యా, ఎప్పుడుచూసినా ఏదో ఆలోచిస్తూ వుండేవాడివి - ఈనాడు ఎంతో సంతోషంగావున్నావు ?" - మేనకోడలు రైతు రామయ్యను ప్రశ్నించింది.

"అవునుతల్లీ. ఆ రోజులు వేరు - నేటి రోజు వేరు."

"సంక్రాంతి పండుగ వచ్చింది. తీరకుండావున్న అన్ని సమస్యలనూ తీర్చి కుటుంబానికి శాంతిని చేకూర్చింది" - అన్నాడు రామయ్య పెదాలలోని చిరునవ్వులను దాచుకుంటూ.



కవిరాజు
గ్రంథావళి

అచ్చులో

భగవద్గీత

శంబుక వధ

ఖూని

కురుక్షేత్ర సంగ్రామం

అముద్రిత వ్యాసాలు

KADALI POYINA
RAILU BANDI
By
*YELLORA*

A NAVODAYA PUBLICATION

PRICE
1-00



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 105 B1146 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/10/216 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | prabhu |
| పేజీలు విడదీసినది | yasin thasin |
| స్కాన్ చేసినది | Reksana |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యలేని | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |